29-5-1992 శుక్రవారం 14 పేజీలు సంపుటి :63 సంచిక :21 విడిప్రతి : రు. 1.50 లు

Regd. No. H.N.L. 10

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



హిమయత్ నగర్‌లో

## ఓటమే గెలుపు అవుతుందా?

రాష్ట్రంలో జరుగుతున్న కీలకమైన ఉప ఎన్నికల పట్ల రాజకీయ వాదులలో తప్ప సాధారణ ప్రజలలో ఎటువంటి ఆసక్తి కనపడడం లేదు. కాంగ్రెస్ శిబిరాలలోను హిమయత్ నగర్ పైనే వుంది ఉత్కంఠ అంతా. సి ఎం పదవికి తానెప్పుడూ పై అంటానని నామినేషన్ల రోజే ప్రకటించిన జగన్నాధరావు ఈ నియోజక వర్గంలో బిజెపి నరేంద్ర ధాటికి తట్టుకోలేక పోతున్నారు. నరేంద్రకు నియోజక వర్గం కొట్టిన పిండి. వీధి వీధి, సందు సందు తెలిసినవే. సిటీ మొత్తంలోని బిజెపి కార్యకర్తలు ఇక్కడే మొహరించి వున్నారు హిందూ నాయకత్వ సెంటిమెంట్ వుందనే వుంది. ఇక్కడ ముస్లింల జనాభా తక్కువే. మజ్లిస్‌కు చెప్పుకో తగిన బలం లేదు. జగన్నాధరావు పరిస్థితి అదికాదు. ఎన్నికల రాజకీయాలతోనే ఆయనకు టచ్ పోయింది. మండే ఎండలు, ముదిరిన వయసు, ముంచుకొచ్చి వున్న అనారోగ్యం ఆయన ప్రచార రథాన్ని కుంటినడక నడిపిస్తున్నాయి. నరేంద్ర వలె ఇల్లిల్లు తిరిగి ఓట్ల భిక్ష నర్థించే పరిస్థితిలో లేరు. కాంగ్రెస్ కార్యకర్తల సహాయనిరాకరణ వుండనే వుంది. అధికారం బలంతో బెదరగొడితే బెదిరే పరిస్థితిలో నగర ఓటర్లు లేరు. జగన్నాధరావు గెలుపు అనుమానాస్పదమైనదంటున్నారు. నిజానికి ఈ నియోజక వర్గంలో కాంగ్రెస్ ఓటమి ముఖ్యమంత్రి గెలుపు క్రింద పరిగణన అవుతుంది. జనార్ధనరెడ్డి అభీష్టానికి వ్యతిరేకంగా టికెట్ తెచ్చుకున్నవాడు జగన్నాధరావు. హనుమంత రావు వంటి అసమ్మతీయులంతా ప్రక్కన చేరడంతో తాను ముఖ్యమంత్రి దగ్గరకా పోలేక పోతున్నాడు. జగన్నాధరావు గెలిస్తే ముఖ్యమంత్రి పై అసమ్మతి వత్తిడి పెరిగిపోతుంది. ఓడితే ఒకటి రెండు రోజులు ప్రెస్ స్టేట్‌మెంట్ల న్యూసెన్స్ తప్ప మరేమీ వుండదు. కాని జనార్ధన రెడ్డి మాత్రం ఓటమి పార్టీకి శ్రేయస్కరం కాదన్న రీతిలో చిత్తశుద్ధిగా జగన్నాధరావు గెలుపుకు కృషి చేస్తున్నాడు.

### మర్రికి చింతలేదు; ఆళ్లగడ్డలో ఎన్నికే లేదు!

మర్రి శశిధర్ రెడ్డికి ఇంతటి సంకటాలు లేవు. చెన్నారెడ్డి అనుచర గణమంతా సనత్‌నగర్‌ను తమ సర్వంగా భావించి పనిచేస్తున్నది. ప్రత్యర్థులంతా బలమైన వారు కాదు. మజ్లిస్‌పార్టీ మద్దతు లభిస్తున్నది. పైగా శశిధర్ రెడ్డి గెలుపు ఓటములు రాష్ట్ర స్థాయిలో కాంగ్రెస్ రాజకీయాలను ప్రభావితం చేయలేవు. ఆయన గెలిస్తే, మంత్రి వర్గంలో ఒక సీటు అడుగుతారే తప్ప, అంతకు మించి ఆశించలేరు. అందువల్ల పనిగట్టుకొని ఓడిపోవాలని ప్రయత్నించే వారెవరూ లేరు, వుండరు.

ఆళ్ళగడ్డ లో పరిస్థితి ఇప్పుడే చెప్పలేము. అక్కడ ఎన్నిక ఒక ప్రహసనం మాత్రమే. పోలింగు రోజు ఎవరెక్కువ బాంబులు వేయగల్గితే వారు, ఎవరెక్కువ బూతులు ఆక్రమించ గల్గితే వారు, ఎవరెక్కువ దొంగ ఓట్లు గుద్దుకోగల్గితే వారు గెలుస్తారే తప్ప; ఓట్లు వేయడం, ప్రజలలో ఆదరణ పొందడం, ప్రచారం చేయడం వంటి వన్నీ పేరుకే! అధికారం కాంగ్రెస్ వైపు వుంది కాబట్టి, రిగ్గింగ్ బాంబుల ప్రేలుళ్ళలో వారికే అవకాశం ఎక్కువ వుండాలి!

### శివాజీని చెంపదెబ్బ కొట్టింది నిజమేనా ?

తెలుగు దేశం ఎమ్పీ శ్రీ యలమంచిలి శివాజీని ముఖ్యమంత్రి శ్రీ ఎన్ జనార్ధనరెడ్డి నాలుగు సార్లు చెంప దెబ్బ కొట్టారని హిందు పత్రిక ప్రచురించిన వార్త రాష్ట్రమంతా సంచలనం సృష్టిస్తున్నది. నిజనిజాలు విచారించకుండా ఎన్‌టిరామారావు దీనిని పెద్ద రాజకీయ రగడగా చిత్రీకరించేశారు; మహానాడు వేదికపై పాలికేకలు పెట్టారు.

అసలింతకూ ఈ వార్త నిజమా? నిజమని జనం నమ్మలేక పోవడమే కాదు, శివాజీ కూడా నిజమని చెప్పలేక పోతున్నారు. ఇదేమీ నాలుగు గోడల మధ్య జరిగిన సంఘటన కాదు.

కొరవ 8 పేజీలో

# పినాకినీ తీరం

## "సమకాలీన కథ"

డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి గారు తన స్వీయ చరిత్ర వ్రాయడానికి మొన్నటి వరకు విముఖులు. ఆత్మకథ వ్రాయమని ఆయన్ను ఎందరో ఎన్ని సార్లో కోరారు; కాని అది ఆయన మనసులో పడలేదు. మనసు విప్పి తన అనుభవాలకు అక్షర రూపం ఇవ్వడం ఆయనకు ఇష్టం వున్నట్లు లేదు. నిజం వ్రాస్తే నిష్ఠూరం; వున్న మాటంటే వుంటూరవ్విరాదు; యథార్థ వాది లోకవిరోధి – ఆటోబయోగ్రఫీ వ్రాసి ఈ కడి అంతా కొని తెచ్చుకోవడం ఎందుకను కున్నారో ఏమో. వివాద రహితమైన తన సహజ స్వభావానికి విరుద్ధమనుకున్నారో ఏమో – ఇంత వరకు వారు ఆ ఆలోచనకు చోటివ్వలేదు.

ఈ విషయంలో ఎందువల్లనో ఆయనలో అకస్మాత్తుగా మార్పు వచ్చింది; ఆత్మకథ వ్రాద్దామనే సంకల్పం కల్గడం, దానికి శ్రీకారం జరగడం, వ్రాత కూడా కొంత సాగడం మే నెలలోనే తటస్థించింది. తాను ప్రారంభించిన తన ఆత్మకథకు గోపాలరెడ్డి గారు "సమకాలీన కథ" అని నామకరణం కూడా చేసివేశారు. ఈ విషయం తెలిసిన తర్వాత నాకు ఎంతో సంతోషం కలిగింది; ఆ ఆత్మకథ వ్రాయమని గతంలో కోరిన వారిలో నేనూ ఒకణ్ణి.

గోపాలరెడ్డి గారికి తిధి వార నక్షత్రాల మీద, ముహూర్తాల మీద నమ్మకం లేదు. తన జీవితంలోని ముఖ్య ఘట్టాల తేదులే ఆయనకు సుముహూర్తాలు. మంచి పని ప్రారంభానికి ముహూర్తం. కత్తిర వంటివి నిషేధమైనా ఆయన మే నెలలో కొత్త రచనకుపక్రమించారంటే ఆయన రాజకీయ జీవితంలో మే నెలకు ప్రత్యేక ప్రాధాన్యత వుండబట్టే. మొట్టమొదట 1930 ఉప్పు సత్యాగ్రహంలో జైలు శిక్షపడింది మే నెలలో; 1932 విదేశీ వస్త్ర బహిష్కరణ ఉద్యమంలో స్వర్గీయ పొణకా కనకమ్మ గారి తోటి జైలు పాలైంది మేలో. 1932 మే 26 తేది రెండవ సారి జైలు పాలైన రోజట. తన స్వాతంత్ర్య పోరాట జీవితంలో పరమ పవిత్రమైనదిగా భావించబట్టే గోపాలరెడ్డి గారు స్వీయచరిత్ర రచనను మేలో ప్రారంభించి వుంటారని నా వూహ.

ఆత్మకథ వ్రాయదగిన కొద్ది మంది తెలుగు వారిలో గోపాల రెడ్డి గారొకరు. ఒక విధంగా చూస్తే ఒక్క రాజకీయాలలోనే గాక, సాహిత్య సంగీత కళారంగాల పట్ల అభిరుచి, అనురక్తి, ఆసక్తి, ప్రవేశము, అన్ని రంగాలలోని పెద్దలతో పరిచయము కలిగిన ఏకైక వ్యక్తి గోపాల రెడ్డి గారొక్కరే అన్నా అతిశయోక్తి దోషం వుండదనుకుంటాను. ఆత్మకథ వ్రాయడానికి, భవిష్యత్ తరాల వారు దానివల్ల స్ఫూర్తి పొందడానికి గోపాలరెడ్డి గారి కంటే అర్హులెవరు? బహుశా రాజకీయ నాయకులలో ప్రకాశం పంతులు గారు తన జీవిత చరిత్రను వ్రాశారు; రెండు సంపుటాలుగా ప్రచురించారు; అది అసంపూర్ణంగానే వుండిపోయింది. కమ్యూనిస్టు మహానాయకుడు కీ.శే. పుచ్చలపల్లి సుందరయ్య గారు కూడా వ్రాసినట్లు జ్ఞాపకం. నీలం సంజీవ రెడ్డి గారు ఇంగ్లీషులో వ్రాశారు. ఇంకెవరైనా వ్రాసి వున్నారేమో నాకు తెలియదు. గోపాలరెడ్డి గారు తెలుగులో వ్రాస్తున్నారు. ఆంధ్రదేశంలో ఆత్మకథ వ్రాసిన మొట్టమొదటి వారు కందుకూరి వీరేశలింగం గారు.

తమ జీవిత కథలకు ఎవరికి తోచిన పేరు వారు పెట్టుకుంటారు. గాంధీజీ My Experiments with Truth అన్నారు; నెహ్రూజీ సాదాగా ఆటోబయోగ్రఫీ అనే పేరుపెట్టుకున్నారు; రంగాజీ Prision of Politics అని నామం పెట్టుకున్నారు. ఇట్లా ఎవరి మనస్తత్వానికి తగినట్లు వారు నామకరణం చేసుకున్నారు. గోపాలరెడ్డి గారు మాత్రం "సమకాలీన కథ" అని పేరిడినారు. పేరులో ఏముంది పెన్నిధి అంటారు గాని, గోపాలరెడ్డి గారు పెట్టుకున్న పేరు మాత్రం మామూలుగా లేదేమోనని పిస్తుంది. ఇరవయ్యవ శతాబ్దపు తొలి దశాబ్దం నుండి చివరి దశాబ్దం వరకు విస్తరించింది ఆయన జీవితం. అందువల్లనే ఆయన తాను ఇరవయ్యవ శతాబ్దపు మనిషిని అని సగర్వంగా, సాధికారంగా చెప్పుకున్నారు. ఈ సుదీర్ఘ కాలంలో జరిగిన సంఘటనలకు, సన్నివేశాలకు ఆయన ప్రత్యక్ష సాక్షి. అంతే కాదు – అరవయ్యేళ్ళుగా స్వాతంత్ర్య పోరాటంలో, అధికారంలో, సాహిత్య సాంస్కృతిక కళారంగాలలో ఆయన పాత్రవుంది; ప్రత్యక్ష అనుభవం వుంది. అదే కాదు అరవయ్యేళ్ల కాంగ్రెస్ చరిత్ర ఆయన చరిత్ర; ఈ కాలంలో కాంగ్రెస్ వున్నతి ఆయన వున్నతి. కాంగ్రెస్ క్షీణత / ఆయన క్షీణత. భిన్న స్వభావము, భిన్న వర్గాలకు చెందిన అసంఖ్యాకులైన రాజకీయ నాయకులతో ఆయన కలసి పనిచేశారు. కాంగ్రెస్‌లోని నాయకులు, వ్యక్తుల విషయంలో ఆయనకు దురభిమానాలు వుండినాయో లేదో గాని, ప్రత్యేక అభిమానా లుండినాయి. ఉమ్మడి మద్రాసు కాంగ్రెస్ రాజ్యంలో – అందరి వలె వీధి కెక్కిన కుసంస్కారి కాదు గాని – ఆయన ఒక వర్గానికి అనుబంధితుడు. కాంగ్రెస్‌లోని నాయకు లందరిలో సాహిత్యం పట్ల, కళల పట్ల విశేష ఆదరాభిమానాలు గల వ్యక్తిగా గోపాలరెడ్డి గారొక్కరికే గుర్తింపు. కవి పండితులతో, కళాకా రులతో ఆయన కున్న పరిచయాలు మరో రాజకీయ నాయకునికి లేవు. సంఘటనలు సన్నివేశాలు, వ్యక్తులు విషయాలతో తన అనుభవం, అభిప్రాయాలు గోపాలరెడ్డి గారి 'సమకాలీన కథ' లో ప్రతిబింబించాలి. ప్రజలకు తెలియని, వెలుగులోకి రాని విషయాలతో పఠితలలో వుత్కంఠతను కల్గించేదిగా వుండాలి ఆ 'కథ'. ఒక్క మాటలో చెప్పాలంటే సమకాలీన కథ గోపాలరెడ్డి గారి విచ్చిన హృదయ పుటలతో తలకూడిన జీవితకథగా భాసించాలి!

గోపాలరెడ్డి గారు తన స్వీయ కథా రచనకు ఉపక్రమంచి నందుకు మరోసారి నా హర్షాన్ని ప్రకటించు కుంటున్నాను.

## "వద్దన్నా గెలుస్తారేమో"!

జూన్ 8 తేది రాష్ట్ర శాసనసభకు జరుగనున్న వుప ఎన్నికలను గూర్చి ఒక నాయకుని అభిప్రాయం అది. ఆళ్లగడ్డ మీద కాంగ్రెస్ వాళ్లకు నమ్మకం వుంది. హైదరాబాదు నగరంలో రెండు వుప ఎన్నికలలో కూడా ఇప్పుడు కాంగ్రెస్ నాయకులకు ఆశాభావం అంకురించిందని పై అభిప్రాయాన్ని బట్టి అనుకోవాలి.

ఉప ఎన్నికలు ముందు పెట్టుకొని, అభ్యర్థులను గెలిపించ వలసిన బాధ్యత, గెలుపు ఓటముల పేరు ప్రతిష్టలు ముఖ్యమంత్రివని తెలిసి ప్రధాని పి.వి., ముఖ్యమంత్రి జనార్దన రెడ్డిని కించపరచారు. కాంగ్రెస్ ప్లీనరీ జరిగిన రాష్ట్ర ముఖ్యమంత్రికి వర్కింగ్ కమిటీలో స్థానం కల్పించడం ఆనవాయితీగా వస్తున్న సాంప్రదాయం. దానికి స్వస్తి చెప్పారు పి.వి. అభ్యర్థుల నిర్ణయం ఆయన అభీష్టానికి విరుద్ధంగా జరిగింది.

ఈ ఎన్నికలలో జనార్దన రెడ్డిది సంకటమైన స్థితి. అభ్యర్థులు గెలిస్తే అది తమ ప్రభావమని, ప్రతాపమని కుప్పిగంతులు వేస్తారు, 'మీసాలు' మెలితిప్పుతారు; ఓడితే, జనార్దనరెడ్డి వ్యతిరేకంగా చేసి ఓడించారని నిందలు వేస్తారు. ప్రజలు కూడా అభ్యర్థుల మంచి చెడ్డలు, నియోజక వర్గాల పరిస్థితులు, అక్కడ నెలకొని వున్న వాతావరణం వంటి వాటిని పరిగణనకు తీసుకోరు. గెలిస్తే జనార్దన రెడ్డి జిందాబాద్ అంటారు; ఓడితే ఆయన మీద, ఆయన ప్రభుత్వ విధానాల మీద ప్రజలిచ్చిన వ్యతిరేక తీర్పు అని గోలపెడతారు.

ఒక గండం గడిస్తే మరొకటి, ఒక అవరోధం తొలగిపోతే మరొకటి, ఒక తుఫాను నుండి బయట బడితే మరొకటి ప్రత్యక్షమవుతున్నాయి జనార్దన రెడ్డికి. అయినా అన్ని విషయాల్లో ఆయనే విజయుడవు తున్నారు; అదృష్టం ఆయనకు కలిసి వస్తున్నది. జనార్దన రెడ్డి అదృష్టానికి మరొక పరీక్ష ఈ ఉపఎన్నికలు. ఇందులో కూడా కాలం ఆయన ప్రక్కన వుంటుందో లేదో చూడాలి. మహానాడు ప్రదర్శనం. నేషనల్ ఫ్రంట్ కేంద్రీకరణ ప్రభావం సిటీ వుపఎన్నికల మీద ఎంత వరకు వుంటుందో చెప్పలేము గాని, మొన్నటి

(కొరవ 8 పేజీలో)

# శ్రద్ధాంజలి....



మా నాయనమ్మ

## వంగల్లు కాంతమ్మ గారు

(స్వర్గీయ వంగల్లు కోదండరామరెడ్డి గారి భార్య)

23.5.92 తేది శనివారం స్వర్గస్తురాలైనది.
ఆమె పవిత్రాత్మకు శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

## వారి కర్మక్రతువులు

**6.6.92** తేది శనివారం నిలుపు
**7.6.92** తేది ఆదివారం ఎత్తురేవు

నెల్లూరు డోర్ నంబర్ 16/1611-1, రామమూర్తి నగర్‌లో జరుగును.
బంధుమిత్రులు తెలియగోరుతాము.

— వంగల్లు శ్రీనివాసుల రెడ్డి

# జమీన్‌రైతు
## పాకిస్తాన్ దుశ్చర్య

భారత దౌత్యోద్యోగి రాజేష్ మిట్టల్‌ను పాకిస్థాన్ పోలీసులు చిత్రహింస పెట్టిన తీరు పరమ ఆటవికమైనది; పాశవికమైనది. విదేశీ రాయబార కార్యాలయోద్యోగిని అరెస్టు చేసేందుకు ఏ దేశానికి అధికారం లేదు. అది అంతర్జాతీయ దౌత్యనియమాలకు విరుద్ధం. అటువంటిది రాజేష్ మిట్టల్‌ను అక్రమంగా అరెస్టు చేయడమే కాక, ఏడు గంటల పాటు చిత్రహింసలు పెట్టారు; కాళ్ళు, చేతులు కుళ్ళ బొడిచారు; కరెంట్ షాక్ ఇచ్చారు. ఇంత క్రూరంగా హింసించడానికి రాజేష్ చేసిన తప్పిదం ఏమిటో ఎవరికి తెలియదు. దీనిపై భారత దేశంలో తీవ్ర క్రోధావేశాలు వ్యక్తమైనా పాకిస్తాన్ ప్రభుత్వం లెక్కచేయక పోవడం, కనీసపాటి క్షమాపణ సైతం వ్యక్తం చేయక పోవడం ఇంకా దారుణం. ఈ విషయంలో పాకిస్తాన్ ఎంత నిర్లక్ష్యంగా నిర్భాధ్యంగా వ్యవహరిస్తున్నదంటే, చావు బ్రతుకుల్లో వున్న రాజేష్‌ను ఢిల్లీకి తీసుకరావడానికి ప్రత్యేక విమానం పంపుతామని భారత దేశం అడిగితే, అందుకు నిరాకరించారా సంస్కారహీనులు. ప్రపంచంలో ఏ దేశం కూడా మరొక దేశపు రాయబారుల పట్ల ఇంత ఆటవికంగా, అనాగరికంగా ప్రవర్తించదు.

ఈ దుర్ఘటన జరగ గానే ప్రధాని శ్రీ పివి వాలా హుందాగా భారత పాక్ సంబంధాలపై దీని ప్రభావం వుండబోదని ప్రకటించారు. కాని పాకిస్తాన్ పశ్చాతాపం ప్రకటించక పోగా తన క్రూరత్వాన్ని సమర్థించుకోవడం, విమానం పంపడానికి అనుమతించక పోవడం, తప్పు చేసిన అధికారులనెవరినీ ఏమీ చేయక పోవడమేగాక, అసలిది తప్పే కాదన్నట్లు మాట్లాడడంతో ప్రధానికూడా తీవ్రంగా స్పందించక తప్పలేదు. ఇద్దరు పాక్ దౌత్యోద్యోగులను దేశ బహిష్కారం చేయడంతో పాటు ఉభయ దేశాల విదేశాంగ కార్యదర్శుల స్థాయిలో జరుగనున్న సమావేశాన్ని రద్దుచేస్తున్నట్లు ప్రకటించారాయన. 1990 లో యుద్ధ వాతావరణం నెలకొన్న సమయంలో శాంతి స్థాపనకు ప్రారంభించిన సమావేశాలివి. ఇటువంటివి ఇప్పటికి ఐదు జరిగాయి. ఆరవది జరగవలసి వుంది. దాని తర్వాత, జూన్ 13 తేది ప్రధానులిద్దరూ సమావేశం కావాలి. ఈ శాంతి యత్నాలకు రాజేశ్ దుర్ఘటన విఘాతం కల్గిస్తున్నది.

ఇంతకూ దౌత్యోద్యోగిని హింసించి, పశ్చాతాపంకూడా ప్రదర్శించ కుండా పెడసరంగా వ్యవహరించడంలో పాకిస్థాన్ ఉద్దేశ్యమేమిటి? ఇదేదో కాకతాళీయంగా జరిగిన సంఘటన మాత్రం కాదు. కావాలనే సృష్టించిన రగడ. అందుకు రెండు కారణాలు కన్పిస్తున్నాయి. మొదటిది ఇండియాతో యుద్ధానికి ఏదో ఒక సాకు వెతకడం; రెండవది అంతర్గత సమస్యల నుంచి, సైనికాధికారుల నుంచి వస్తున్న ఒత్తిడిని తప్పించు కోవడం! భారత దేశంతో యుద్ధం చేయాలనే తపనను పాకిస్తాన్ ఇటీవల పలు సందర్భాలలో వ్యక్తపరుస్తున్నది. కాశ్మీర్, పంజాబ్ తీవ్రవాదులకు శిక్షణ నివ్వడంతోపాటు, శిక్షితులైన వారిని సరిహద్దులు దాటించడానికి నేరుగా తమ సైనికులనే ఉపయోగించడం ద్వారా సరిహద్దులలోని భారత సైనిక కేంద్రాలపై కాల్పుల జరపడం వంటి చర్యల ద్వారా పాకిస్తాన్ మనల్ని కవ్విస్తున్నది. కేంద్రంలో బలహీన రాజకీయ ప్రభుత్వం వుంది కాబట్టి, అంతర్గతంగా పలు సమస్యలున్నాయి కాబట్టి కాశ్మీర్‌ను చేజిక్కించుకోవడానికి ఇదే తరుణమని వారి భావన. ఆఫ్ఘనిస్తాన్ సమస్య పరిష్కారం కావడంతో పాకిస్తాన్‌కు పెద్ద బరువు తొలగిపోయింది. ఆఫ్ఘన్ ముజాహిద్దీన్‌లు భారత్‌పై అలుక వహించి వున్నారు. యుద్ధమంటూ వస్తే వారు పాకిస్తాన్‌ను సమర్థిస్తారు. ఈ అన్ని అనుకూలతలు పాకిస్తాన్‌కు ఆశలు రేకెత్తిస్తున్నాయి. అందుకు నాంది ఈ సంఘటన కావచ్చు.

అయితే ఒళ్ళు తెలియని అహంకారంతో, కళ్ళు పొరలు క్రమ్మిన కండకావరంతో పాకిస్తాన్ ఆశలు పెంచుకుంటున్నది కాని, అజేయమైన భారత సైనికశక్తి ముందు, అచంచలమైన భారత జాతి సంకల్ప బలం ముందు పాక్ ఎత్తులు చిత్తుకాక తప్పదు. ఇప్పటికి మూడు సార్లు వారా చేదుఅనుభవాన్ని చవిచూచారు; మళ్ళీ మిడిసి పడుతున్నారు.

అయితే యుద్ధంలో గెలుపు ఓటములు ఎవరివైనా, ఉభయ పక్షాల ఆర్థిక వ్యవస్థలూ ఛిన్నాభిన్నమౌతాయి. ప్రపంచమంతా శాంతి మంత్రం పఠించే సమయంలో ఇండియా, పాకిస్తాన్ వంటి పేద దేశాలు యుద్ధానికి తలపడడం వినాశనాన్ని కోరితెచ్చుకోవడమే. ఇప్పటికైనా ఈ వాస్తవం గ్రహించి ఉభయ పక్ష నాయకులూ ఈ సమస్యను సామరస్య పూర్వకంగా పరిష్కరించుకోవడం అవసరం. పాకిస్తాన్ ఈ విజ్ఞాన్ని గ్రహించి, వ్యవహరిస్తుందనే ఆశిద్దాం! అప్పటికీ వారు మూర్ఖంగా పోతే, బుద్ధి చెప్పడం ఇండియాకు తప్పని సరి.

---

## జమీన్‌రైతు

29-5-42

8 పేజీలు అణా

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### నెల్లూరు ముచ్చట్లు

#### టీ పార్టీ

జర్నలిస్టు అసోసియేషన్ తరఫున మిత్రులు బైరవరసు హనుమంతరావు గారికి "జమీన్‌రైతు" ఆఫీసులో 28 సాయంత్రం టీపార్టీ యిచ్చారు. హనుమంతరావు గారు పత్రికా రచనలకు సంబంధించిన ఎన్నో విషయాలనుగూర్చి యిష్టాగోష్ఠిగా ముచ్చటించి అమూల్యసలహాలనిచ్చిరి.

#### పరామర్శ

బుచ్చిలో ఇంత మంచి పేరు సంపాయించు కొన్నవారు దొడ్లా రుక్మిణమ్మ, బెజవాడ వెంకట కృష్ణారెడ్డి, గారలు మాత్రమేనంటే యెవరూ మా మీదకు రారనుకొంటాను.

పాపం రుక్మిణమ్మ గారి కుమార్తె బిడ్డ 24 తేది మరణించింది. దీన్తో ఆమె కుప్ప కూలిపోయింది. అమ్మా ! "ఋణానుబంధ రూపేణా పశుపత్నిసుతాలయః" అన్నమాట జ్ఞప్తికి దెచ్చుకొని ఊరడిల్లుడు.

హాస్యనట చక్రవర్తి రాళ్ళపల్లి నటేశం గారికి 24 వతేది పత్నివియోగం సంభవించింది. ఔను, భరింపరానిదే. "ప్రాం బుబ్ధం భుండతేనశ్యం" అన్నారు.

డాక్టరు అప్పలనర్సమ్మ పెంపుడు బిడ్డ 'నిర్మల' రాలి పోయిందని దుఃఖసముద్రంలో అట్టే మునిగిపోయింది. ఈశ్వరుని లీల. పుట్టిన పిందెలన్నీ నిలుస్తవా!

#### గలాటాలు

27 వ తేది పగలు జండా వీధిలో మహమ్మదీయుల యిల్లు, మహమ్మదీయులే తగులబెట్టారని పోలీసు రిపోర్టు.

తేది 18 రాత్రి నవలాక్ తోటల్లో దస్తగిరి సాహెబ్ తాలూకు రెండు పూరిపాకలు తగుల బెట్టారు.

వకీలు ముత్తరాజా శ్రీనివాసరావును పొడిచిన కేసు 28, 29 తేదులలో విచారణ సాగుతున్నది. ఇందులో ముద్దాయి సబ్‌యిన్‌స్పెక్టరు అబ్దుల్ ఖాదరు తమ్ముడు బాషా.

ఈ వారం సుమారు 15 మందిని యిరు సంఘాల్లో అరెస్టు చేసి 110 సె.కేసులు బెట్టారు.

#### పెరోల్

డిటిన్యూగానున్న బస్వారెడ్డి శంకరయ్య (ఇందుపూరు) 10 రోజాలు పెరోల్ మీద 25 తే విడుదలై వచ్చారు. తల్లీ, భార్య, బంధు మిత్రాదులను చూచి తిరగా దేవిడీ చేరుకుంటారు.

#### రాపూరు సత్రం

" దాకలోడి కెండుకోయ్ ఇంతలావు నాలగ" అన్నట్లు రాపూరు కెందుకింత మంచి సత్రమును కొన్నారేమా? ఆ లోకల్ ఫండు సత్రం ఎప్పుడూ తాలూకా ఆఫీసు గుమాస్తాలకే కాపురం అయింది. ఆ చీమలు బెట్టిన పుట్టలు ఈ పాములకే సదాయిరవు కాబోలు? మర్యాదంటే ఒకటి రెండు దినాలు గాని ఇదేం న్యాయమండి?

----బాటసారి.

#### బుచ్చి ఆసుపత్రి

మీరు ఏం జెప్పినా డాక్టరు మాత్రం మాకు ఏమీ ఉపకరించడంలేదండి!

లోకంలో ఏ సంస్థ ఉండినా ధనవంతులకే అయితే ఇహమూగతో? "లేనివారు పుడమిలేని వారే" నా?

---- పేద రోగి.

#### విడవలూరు

గత 17 తేది యువజన సంఘం స్థాపించబడింది. ప్రెసిడెంటు చిట్టేటి అంకయ్య, కార్యదర్శి నలబోలు కోటయ్య, కార్యవర్గ సభ్యులు దాసరి వీరాస్వామి, చేవూరు వెంకయ్య, విడవలూరు కనకయ్య గారలు.

-- ఒ.వి.

యాక్టింగ్ కర్ణం సాగుబడి దావాడని చిట్టేటి అంకయ్య పెట్టిన అర్జీ మీద తనికీకి వచ్చిన తాసిలు దారువారు అంకయ్యను దుర్భాషలాడారంటారే నిజమేనా ?

-- పౌరుడు.

---

# ఎసి స్టేడియం కమిటీవేయరా?

నెల్లూరు ఎసి స్టేడియం నిర్మాణం పట్ల ముఖ్యమంత్రి శ్రీ జనార్ధన రెడ్డి చూపిన ఆసక్తి ఫలితంగా దానికొక రూపు రేఖ లేర్పడుతున్నాయి. నిధుల కొరత తీరింది. కాని స్టేడియం నిర్వహణే అబందరగా వుంది. అధికారుల చైతన్యంలో అధ్వాన్నంగా తయారైతుంది. స్టేడియం కమిటీని తక్షణం పునరుద్ధరించితూ, ఉత్సాహం ఆసక్తి కలిగిన క్రీడాభిమానులకు నిర్వహణ బాధ్యత అప్పచెప్పడం జరగాలి! అప్పుడే దానిలో ఏర్పడుతున్న క్రీడల వసతులు సక్రమంగా పౌరులకు పయోగ పడతాయి. కలెక్టరు గారు ఈ విషయంపై శ్రద్ధచూపాలి.

ఎవి రెడ్డి

నెల్లూరు.

## జనవాణి

### రోడ్డుపైనే అంగళ్ళు — అంగళ్ళముందు సైకిళ్ళు

నెల్లూరులో గాంధీ బొమ్మ నుంచి ఇటు ఏసిబొమ్మ వరకు, అటు కనకమహల్ సెంటర్ వరకు రోడ్డు రానురాను ఇరుకైపోతున్నది. కొత్త కొత్త అంగళ్ళు రోడ్డుపైకి దూసుకొని వస్తున్నాయి. ప్లాట్‌ఫారాలూ ఆక్రమించేస్తున్నారు. వాటికి ఎదురుగా వరుసలు వరసలుగా సైకిళ్ళు, స్కూటర్లు నిలుపుతున్నారు. ఇక వాహనాలు నడవడానికి దారేది? రెండు ప్రక్కల నుంచి రోడ్డును మూసివేస్తున్నా అడిగేవారు కన్పించడం లేదు.

ట్రంకురోడ్డులో రాత్రికి రాత్రి అంగళ్ళు పగల గొట్టి కొత్త బిల్డింగులు కట్టేస్తున్నారు. అంతస్తులకు అంతస్తులు లేపేస్తున్నారు. రోడ్డుకు ఆనుకొని కొత్త కట్టడాలు వస్తుంటే మునిసిపాలిటి ఏమి చేస్తున్నదో అర్థం కావడం లేదు. కనీసం కలెక్టరు గారైనా ఈ దుర్మార్గ ఆక్రమణలను నిరోధించాలని మనవి. లేకుంటే మరొక పదేళ్ళకు ట్రంకు రోడ్డులో మనిషి నడవడానికి కూడా సందు వుండదు.

బి. శంకరనారాయణ

గూడూరు.

### ఏమిటీ అన్యాయం?

నెల్లూరులోని మునిసిపల్ రీజినల్ డైరెక్టర్ కార్యాలయాన్ని రద్దు

కొరవ 9 పేజీలో

అరాజకంగా వున్న విద్యుత్ సరఫరా

# ఏం నేరం చేశారని ప్రజలకు ఈశిక్ష?

వాళ్ల సమస్యలు ఎన్నయినా వుంత వచ్చు; వాళ్ల కారణాలు ఎన్నయినా వుండవచ్చు; కాని విద్యుత్ సరఫరా మరీ అరాజకంగా, దుర్భరంగా, దుస్సహంగా తయారైంది; మరీ అమ్మ అబ్బ అలవాపాలనా లేకుండా పోయింది.

పల్లెటూరు ప్రజలు అన్ని విషయాల్లో రెండవ తరగతి పౌరులన్న పాధ్యాన్యానికి ఒక చిన్న ఉదాహరణ: చెరవ చక్కెర కోటా నిర్ణయంలో కూడా పట్టణ పౌరునికిచ్చే ప్రాధాన్యత అధిక్యత పల్లెటూరి వారికివ్వరు. బస్తీపౌరుడికి ఎక్కువ కోటా; అదే తరగతికి చెందిన పల్లెవానికి తక్కువ. ఒకే తరగతికి చెందిన ప్రజల్లో ఈ వ్యత్యాసం ఎందుకుండాలి? ఈ వివక్షణ ఎందుకు అనుసరించాలి?

రాజకీయ నాయకులు పల్లెవాసులను పొగడుతారు; పుబ్బిస్తారు; పూరిస్తారు; మస్కాకొట్టి ఓట్లు వేయించుకుంటారు; పల్లెటూరి ప్రజలు నోట్లో నాలుక లేని వారుకాబట్టి, నిలదీసి అడగలేని వారు కాబట్టి, చొక్కా పట్టుకోలేని వారు కాబట్టి వారి ఆటలు సాగిపోతున్నాయి. విద్యుచ్ఛక్తి సరఫరాకు సంబంధించి కూడా గ్రామాలు నిరాదరింప బడుతున్నాయి. నిర్లక్ష్యం చేయబడు తున్నాయి. రోజుల పర్యంతం విద్యుత్ సరఫరా లేక బిక్కు బిక్కుమంటున్న గ్రామాలనేకం వున్నాయి. కరెంటును నమ్ముకొని వ్యవసాయ కార్యకలాపాలకు దిగడం కుక్కతోక పట్టుకొని గోదావరి ఈదినట్లుగా వుంటున్నది. పల్లెటూళ్ల గతి అది !

పట్టణాల్లో అయినా సరఫరా క్రమపద్ధతిలో వుందా అంటే లేదు. నెల్లూరు టవున్ సంగతే తీసుకుంటే ఆ మధ్య వరకు సరఫరా లేని వేళలు ముందుగా ప్రకటించి తీసేవారు; ఒక గంట అటు ఇటుగా చెప్పిన సమయానికి యిచ్చేవారు. తర్వాత అది వెధవ పద్ధతి అనుకున్నారో, లేక పరిస్థితి స్థానికాధికార్ల చేయిదాటి పోయిందో తెలియదు గాని, సరఫరా దిక్కు దివాణం లేనిదైపోయింది. ఎప్పుడు పొయ్యేది తెలియదు; ఎంత సేపు రానిది తెలియదు; ఎప్పుడొచ్చేది తెలియదు; పౌరులను చిత్రహింస పెట్టేస్తున్నారనుకోండి! టవునంతా చీకటి మయం అయ్యేది వుంది; కొంత భాగంలో సరఫరా వుండి, కొంత భాగంలో లేకుండడమూ వుంది; ఒక రోడ్డులో, ఒక మరొక వీధిలో వుండి మరో రోడ్డులో వీధిలో లేకపోవడమూ వుంది. టవునంతా పూర్తిగా పోయినప్పుడు, హఠాత్తుగా సరఫరా నిల్చిపోయినపుడు, పరిస్థితి స్థానికాధికార్ల చేతిలో లేదనుకోవచ్చు; వారు బాధ్యులు కారనుకోవచ్చు. కాని ఒక చోట వుండి ఒక చోట లేకపోవడానికి, నిర్ణీత సమయాల్లో కాకుండా వేళ పాళ లేకుండా, మంచీ చెడు వివక్షణ లేకుండా సరఫరా నిలపడానికి, పునరుద్ధరించ డానికి ఎవరు కారణం అనుకోవాలి? ఈ అబందర స్థితికి స్థానికాధికార్లదే బాధ్యత అనుకోవడం పొరపాటవుతుందా?

పరిస్థితి పాఠకుల కళ్లకు కట్టినట్లు తెలియడానికి 26 తేది ఒక్కరోజు విద్యుత్ సరఫరా రాకపోకల కథా కమామిషు చెప్తాము. 26 తేది దర్గామిట్ట సబ్ స్టేషన్‌కు దక్షిణంగా ఉదయం 6 నుండి 9-30 వరకు; మధ్యాహ్నం 1 గంట నుండి 2.30 వరకు; సాయంత్రం 5 నుండి రాత్రి 9.30 వరకు సరఫరా లేదు. మధ్యలో రాకపోకలను గమనించలేదు. ఇటీవల దాదాపు ఇదే పరిస్థితి. అకస్మాత్తుగా ఎందువల్ల ఈ దుర్గతి? దుస్థితి ?

> ఎప్పుడు పొయ్యేది తెలియదు –
> ఎంత సేపు రానిది తెలియదు –
> ఎప్పుడు వచ్చేది తెలియదు –
> ప్రజలను హింస పెట్టేస్తున్నారు !

ఒక వైపు ఎండలు ఇటీవలి సంవత్సరాల్లో ఎన్నడూ ఎరుగనంతగా, భరించలేనంతగా, మొహం బయట పెట్టడానికే వీలులేనంతగా భగ్గుమం టున్నాయి. ఎండలకు మనుషులు ఎండి

(కొరవ 13 పేజీలో)

## రాజీవ్ జయంతికి యువజనోత్సవాలు

నెల్లూరు సంగతులు

శ్రీ ఆనం వివేకానంద రెడ్డి నిర్వహించిన సైన్స్ఎగ్జిబిషన్ ముగింపు సభ 22 తేది అర్ధరాత్రి జరిగింది. ఎమ్పీ శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి ముఖ్య అతిథి. మండు వేసవిలో స్కూళ్ళు మూతపడిన సమయంలో ఈ ఎగ్జిబిషన్ ఇంత ఘనంగా నిర్వహించి, రాజీవ్ గాంధీకి వినూత్న రీతిలో నివాళులర్పించడం పట్ల సుబ్బరామరెడ్డి సంతోషం వ్యక్తం చేశారు. ఈ సైన్స్ ఫెయిర్‌లో ప్రతిభ కనబరిచిన 10 మంది విద్యార్థులకు ఉన్నత విద్యాభ్యాసం కోసం ఉపకార వేతనాలు ఏర్పాటు చేస్తున్నట్లు ప్రకటించారాయన.

సభను నెల్లూరు ఎమ్మెల్యేని జె.కె.రెడ్డి అధ్యక్షించారు. ఆగస్టు 20 రాజీవ్ గాంధి జయంతి సందర్భంగా జిల్లా స్థాయిలో యువజనోత్సవాలు నిర్వహించ తలపెట్టినట్లు ప్రకటించారు. వాటి బాధ్యత కూడా ఆనం వివేకానంద రెడ్డినే స్వీకరించమని చెప్పారాయన. కాలె చెట్టుకే కదా రాళ్లదెబ్బలు తగిలేది!

(కొరవ 13 పేజీలో)

## బహిరంగవేలము

కాలపరిమితి గడిచినప్పటికి విడిపించని వద్దులు

1) యస్. రాజేష్ కుమార్ శర్మ పాన్ బ్రోకర్స్ పి.బి.యల్. నెం. 206 3/49 తిరుపతి రోడ్డు రేణిగుంట వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 1.3.89 నుండి 31.12.90 తేది వరకు గల విడిపించని వద్దులు. 29.5.92 తేది వుదయం 10 గంటల నుండి 3/49 తిరుపతి రోడ్డు రేణిగుంటలో బహిరంగముగా వేలము జరుపబడును.

2) ఆర్ పృథ్వీరాజ్ పాన్ బ్రోకరు పి.బి.యల్. నెం. 146 18.2.12 ఎ కొర్లగుంట రోడ్డు, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 14.12.90 నుండి 27.4.91 తేది వరకు గల విడిపించని వద్దులు 6.6.92 తేది వుదయం 10 గంటల నుండి 18.2.12 ఎ కొర్లగుంట రోడ్డు, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

3) జి. ధోకల్ రామ్ పటేల్ పాన్ బ్రోకర్సు పి.బి.యల్. నెం. 173 13.1.22 ఎ పెద్దకాపువీధి. తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 8.2.91 నుండి 31.5.91 తేది వరకు గల విడిపించని వద్దులు 11.6.92 తేది వుదయం 10 గంటల నుండి 13.1.22ఎ పెద్దకాపు వీధి తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

4) జె.యస్. కమలాభాయ్ జైన్ పాన్ బ్రోకర్స్ పి.బి.యల్. నెం. 49 18.2.67 కొర్లగుంట రోడ్డు, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 1.8.89 నుండి 31.12.90 తేది వరకు గల విడిపించని వద్దులు 15.6.92 తేది వుదయం 10 గంటల నుండి 18.2.67 కొర్లగుంటరోడ్డు తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

5) శ్రీ అంబాజీ ట్రేడరు పాన్ బ్రోకర్సు పి.బి.యల్. నెం. 3011/84 6/8మద్రాసు రోడ్డు, కోడూరు కడప జిల్లా వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 18.7.89 నుండి 30.12.90 తేది వరకు గల విడిపించని వద్దులు 16.6.92 తేది వుదయం 10 గంటల నుండి 6/8 మదరాసు రోడ్డు – కోడూరు కడప జిల్లాలో బహిరంగముగా వేలము జరుపబడును.

6) జె. శాంతిలాల్ సునీల్ కుమార్ జైన్ పాన్ బ్రోకర్సు పి.బి.యల్. నెం. 48 18.2.69కొర్లగుంట రోడ్డు తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 1.8.89 నుండి 31.12.90 తేది వరకు గల విడిపించని వద్దులు 17.6.92 తేది వుదయం 10 గంటల నుండి 18.2.67 కొర్లగుంట రోడ్డు తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

కె.వి.రామకృష్ణ రావు
ప్రభుత్వము నియమించిన వేలము దారు
11/268 సంతపేట, నెల్లూరు.

## సినిమాకు ఎటువంటి నవల కావాలి? నవలను ఎట్లా సినిమా తీయాలి ? ప్రతిద్వంది చూచి నేర్చుకోవాలి!

పి. గోపాలకృష్ణ

ఆకాశమంత ఎత్తున్న సత్యజిత్ రాయ్‌ని భక్తి ప్రపత్తులతో కొలవడం తప్ప నిమ్నోన్నతాలు కొలిచే కొల బద్దల్లేవు నావద్ద. భారతీయ చలన చిత్ర కళకు ఆయన కాంతి; అంతేకాదు, ఊపిరికూడా. ఆయననేవాడు లేకపోతే అంతర్జాతీయ చలనచిత్ర చరిత్రలో ఈ దేశానికి స్థానమే లేదు.

ఆ మహనీయుడు జీవకల్పన చేసిన 'ప్రతిద్వంది' చూచే మహ ద్భాగ్యం, నెల్లూరీయులకు కలిగించింది-ప్రొగ్రెసివ్ ఫిల్మ్ అసోసియేషన్ - 4 తేది ఉదయం విజయమహల్లో.

సునీల్ గంగోపాధ్యాయ నవల 'ప్రతిద్వంది'. దాన్నే ఎందుకు ఎన్ను కున్నావని ఎవరైనా ప్రశ్నిస్తే, సత్యజిత్ రాయ్ సమాధానం - సిద్ధార్థ అట.

సిద్ధార్థ నిరుద్యోగి. జీవితం అతనికి ప్రతిద్వంది. ఆ పోరాటంలో ఓడిపోతాడతను. చివరికి అతడ్ని జీవితంతో రాజీపడేట్టు చేస్తుంది సమాజం. ఈ నవలలో పాత్రలు, సంఘటనలు, మనుషుల మధ్య సంబంధాలూ -అన్నీ అతి సున్నితమైన మానవజీవిత పరిశీలనతో నిర్మించ బడ్డాయి. చాలా సహజంగా, సాధారణంగా కనిపించే ఆ పాత్రల్లో పాఠకుడు ఎక్కడో ఒక చోట తమ ప్రతిబింబం చూచుకుంటాడు. సినిమా కథకు కావల్సిన ప్రధానమైన లక్షణం ఇదే.

ఈనాటి యువతరానికి యథార్థ ప్రతినిధి సిద్ధార్థ. అతనిలో ఆశ లున్నాయి, నిస్పృహవుంది. భవిష్యత్తు మీద కలలున్నాయి, అనుమానాలూ వున్నాయి. అసంతృప్తి అసహనం వున్నాయి; వాటిని అణచుకునే వ్యక్తిత్వమూవుంది. పోరాట తత్వం వుంది, రాజీపడే నైజమూవుంది. అంతటి విరుద్ధ మనస్తత్వం కల్గిన పాత్ర చుట్టూ తిరిగిన కథ గనుక సత్యజిత్ రాయ్ 'ప్రతిద్వంది' నవలను ఎన్నకొని వుంటాడు. సునీల్ గంగూలీని సత్యజిత్ Visual Writer ' అంటాడు. నవల చదివితే ఆ మాటే అనిపిస్తుంది. ఆ తర్వాత సినిమా చూస్తే సత్యజిత్ రాయ్ Visual Director' అనిపిస్తుంది. మానవ జీవితాన్ని అతి సహజంగా సున్నితంగా చిత్రించే చిత్రకారుడేమోననిపిస్తుంది. ఇంకాస్త నిశితంగా చూడగల్గితే, ఆ చిత్రణకు వెనుక ఎక్కడో సన్నగా లీలగా వ్యాఖ్యానిస్తున్నట్లు కూడా మనకు స్ఫురిస్తుంది.

సినిమాకు ఎట్లాంటి నవల అవసరం అనే ప్రశ్నకు 'ప్రతిద్వంది' రచన సమాధానమైతే, ఒక నవలను తెరకు ఎట్లా ఉపకరించుకోవాలి అనే ప్రశ్నకు 'ప్రతిద్వంది' చిత్రం సమాధానం. నవలను గురించి సత్యజిత్ మాటలనే ఇక్కడ ఉటంకిస్తే చాలు- " Characters, incidents, relationships are all largely built up by means of sensitively observed external details a fundamentally cinematic device. The dialogue is sparse and life-like with not a trace of high falutin didacticism. If the sufface appears simple, there is depth and density underneath , and there is lyricism too for Sunil is a poet to set beside the sudden, bold, wrenching scenes which strike one as much by their unexpectedness as by their convicition".

ఇక ఆ నవలను సత్యజిత్ రాయ్ తెర కెక్కించడంలో చేసిన కృషి మార్పులను మాత్రం ప్రస్తావిస్తాను

ఫోన్స్ : 26046, 23781



# రావూస్

## రెసిడెన్షియల్ జూనియర్ కాలేజి

G.N.T. రోడ్డు, బుజబుజనెల్లూరు, చెముడుగుంట పోస్ట్, (బాలాజీ స్టీల్స్ సమీపంలో)
ఆఫీసు: రావూస్ కోచింగ్ సెంటర్, చాకలివీధి, నెల్లూరు.

అత్యుత్తమ శిక్షణ | అపూర్వ ఫలితాలు | ఆధునిక వసతులు



1983 సం.లో స్థాపించబడి ఇంటర్మీడియట్, ఎంసెట్‌లకు ఉత్తమ విద్యా బోధన చేస్తూ, ఉత్తమ ర్యాంకులను సాధిస్తూ, అత్యుత్తమ విద్యాసంస్థగా 'రావూస్ కోచింగ్ సెంటర్' పేరొందింది. అదే 'రావూస్' ఆధ్వర్యంలో "రావూస్ రెసిడెన్షియల్ కాలేజి" నెల్లూరుకు 7 కి.మీ. దూరంలో రణగొణ ధ్వనులకు దూరంగా, ప్రశాంత వాతావరణంలో నెలకొల్పబడింది. అనుభవజ్ఞులైన ఉత్తమ అధ్యాపకులచే సుశిక్షణ, రెసిడెన్షియల్ వార్డెన్‌లచే పర్యవేక్షణ, చక్కని లేబొరేటరీ సౌకర్యం, మంచి లైబ్రరీ మరియు అన్ని వసతులు కలవు.

జూనియర్ ఇంటర్ : M.P. & Bi.P. (T.M & E.M) లకు అడ్మిషన్లు ప్రారంభమైనవి. రూ. 30/- M.O./D.D. పంపి అప్లికేషను, ప్రాస్పెక్టస్ పొందవచ్చును.

సీనియర్ ఇంటర్: క్లాసులు జూన్ 1 నుండి ప్రారంభం.

NOTE: ఇతర కాలేజిలలో జూనియర్ ఇంటర్ చదివి, సీనియర్ ఇంటరు మా కాలేజిలో చేరుటకు ప్రవేశము కలదు –

ఫీజు వివరాలు : ఇంటర్, ఎంసెట్–మెటీరియల్ తో సహా శిక్షణ, వసతి భోజనము, పర్యవేక్షణతో మొత్తం ఫీజు కేవలం రూ. 12,000/- మాత్రమే. ఫీజు 3 వాయిదాలలో చెల్లించవచ్చు.

మెరిట్ విద్యార్థులకు రాయితీలు : 10 వ తరగతిలో స్టేట్ ర్యాంకులలో 10 లోపు ర్యాంకు పొందిన వారికి శిక్షణ, భోజనం వసతి ఉచితం – 500 మార్కులు సాధించిన విద్యార్థులకు రు.2,000/- 450 మార్కులు సాధించిన వారికి రు. 1,500/- 400 మార్కులు సాధించిన వారికి రు. 1,000/-

ఫీజులో మినహాయింపులు ఉంటాయి. Note: ఇంటర్‌లో మెరిట్ స్కాలర్ షిప్ ఇవ్వబడును.

స్థాపితం : 1983 ఫోన్స్ : 26046, 23781



## రావూస్ కోచింగ్ సెంటర్

వి.ఆర్.సి. ఎదురుగా, చాకలివీధి, నెల్లూరు –1

గత 9 సంవత్సరాలుగా అత్యుత్తమ ఫలితాలందిస్తున విద్యాసంస్థ.

సీనియర్ ఇంటర్ M.P & Bi.P (T.M & E.M) అడ్మిషన్లు జరుగుచున్నవి. క్లాసులు May 18 నుండి ప్రారంభమైనవి. సీనియర్ ఇంటర్ రెండవ బ్యాచ్ జూన్ - 5 నుండి ప్రారంభం. జూనియర్ ఇంటర్ M.P & Bi.P (E.M & T.M) అడ్మిషన్లు మే 21 నుండి జరుగుచున్నవి.
గత సంవత్సరాల వలనే ప్రతి సబ్జెక్టులోనూ కనీసం 25 యూనిట్ పరీక్షలు నిర్వహించబడును.
సీనియర్ ఇంటర్ సిలబస్ సెప్టెంబర్ ఆఖరుకు పూర్తి చేసి అక్టోబరు నుండి EAMCET కోచింగ్ ఇవ్వబడును.

**NOTE: ముందుగానే అడ్మిషన్ తీసుకొని స్టడీ మెటీరియల్ పొందవచ్చును.**

## నెల్లూరు గుచ్చెళ్ళు

### విలక్షణుడు

**ముఖ్యమంత్రి మూడు రోజుల పర్యటన**

ముఖ్యమంత్రి శ్రీ ఎన్ జనార్ధన రెడ్డి 3 తేది నుంచి 5 తేది రాత్రి వరకు మూడు రోజుల పాటు జిల్లాలో విస్తృతంగా పర్యటించ బోతున్నారు. విల్లర మల్లర కార్యక్రమాలు రోలిదన్ని వున్నా. ముఖ్యమైనవి రెండే రెండు;కోవూరు తల్లూలో నీటి పారుదల వ్యవస్థ మెరుగుదలకు ప్రపంచ బ్యాంకు సహాయంతో చేపడుతున్న 18 కోట్ల పథకం మొదటిది; దుగరాజ పట్నం పరిసర గ్రామాలలోని ఉప్పునీటి కాలువలకు చెక్ డ్యామ్‌లు నిర్మించడం ద్వారా సాగునీటి పారుదల కల్పించే ఐదుకోట్ల పథకం రెండవది; ఇవి రెండూ ఆయా ప్రాంతాల రైతులు జనార్దన రెడ్డి పేరును కలకాలం గుర్తుంచుకునేట్లు చేస్తాయి.

కార్యక్రమ వివరాలివి -3 తేది ఉదయం 9 గంటలకు అల్లూరు ఆర్.టి.సి. బస్ స్టేషన్, విడబ్ల్యుఎస్ పథకం టి.టి.డి కళ్యాణ మండపం ప్రారంభోత్సవాలు; సింగపేట, ఇస్కపల్లి నీటిపథకాలు . జి.ప్ర.ప. హైస్కూలు భవనం ప్రారంభం; మధ్యాహ్నం గూడూరు - ఇళ్ళపథకం శంకుస్థాపన; సాయంత్రం శ్రీకాళహస్తి . అట్నుంచి మద్రాసు.

4 తేది ఉదయం తడ దగ్గర టూరిజం కాంప్లెక్సుకు శంకుస్థాపన; 9 గంటలకు బుచ్చి - 18 కోట్ల నీటి పారుదల వ్యవస్థ మెరుగుదలకు శంకుస్థాపన; 11 గంటలకు నెల్లూరు డికెడబ్ల్యు కాలేజిలో మూడాల జానకిరాం

★★★★★★★★★★★★★★★★

### రామానాయుడు జయంతి

జమీన్‌రైతు స్థాపక సంపాదకుడు స్వర్గీయ నెల్లూరు వెంకట్రామా నాయుడు గారి జయంతి సభ 3 తేది బుధవారం సాయంత్రం 6.30 గంటలకు టౌన్ హాలులో జరుగుతుంది. 'ఉదయం' దిన పత్రిక ప్రధాన సంపాదకుడు శ్రీ గజ్జెల మల్లారెడ్డి, జర్నలిజంపై ఉపన్యసించి రామానాయుడి గారి స్మృత్యంకంగా ఇచ్చే అవార్డు స్వీకరిస్తారు.

జమీన్‌రైతు పాఠకులు, ప్రకటన కర్తలు శ్రేయోభిలాషులందరికీ ఇదే మా హృదయ పూర్వక ఆహ్వానం.

★★★★★★★★★★★★★★★★

తల పెట్టిన హాస్టల్ కాంప్లెక్సుకు శంకుస్థాపన; సాయంత్రం 4 గంటలకు కోర్టు భవనాల కార్యక్రమం; 6.30 కి

తరువాయి 7 పేజిలో

## కవిత్వం, విమర్శనాత్మక రచన, పాత్రికేయత్వాలు మూడింటినీ కళాత్మకంగా మేళవించే మేధావి

# గజ్జెల మల్లారెడ్డి

జమీన్‌రైతు స్థాపక సంపాదకుడు స్వర్గీయ నెల్లూరు వెంకట్రామా నాయుడు గారి స్మృతిచిహ్నంగా ఏటా ఒక ప్రఖ్యాత పాత్రికేయుడికి ఇచ్చే అవార్డును ఈసారి ఉదయం దిన పత్రిక ప్రధాన సంపాదకుడు శ్రీ గజ్జెల మల్లారెడ్డికి అందజేస్తున్నాము రామానాయుడు అవార్డుల పరంపరలో ఇది 16 వది. నార్లతో మొదలు పెట్టి నండూరి రామమోహనరావు వరకు 16 మంది ఉద్దండులైన పాత్రికేయులను జమీన్ రైతు సన్మానించింది.

గజ్జెల మల్లారెడ్డి గారిని తెలుగు పత్రికా పాఠకులకు పరిచయం చేయవలసిన అవసరం లేదు. పత్రికా వ్యాసంగంలోనే కాక, సాహితీ ప్రపంచంలోనూ జగజ్జెట్టి అనిపించుకున్న మల్లయోధుడాయన. తెలుగులో కవిగా చలామణీ కావడం తేలిక; విమర్శకుడిగా గుర్తింపు పొందడం కష్టం; రచయితగా రాణించడం ఇంకా కష్టం. కాని మల్లారెడ్డి గారు ఈ మూడు రూపాలలోను ప్రతి తెలుగు పఠితకు సన్నిహితుడైన మేధావి. కవితను, విమర్శను, వార్తను మిశ్రమం చేసి వ్రాయడం ఆయన విశిష్టత. అందులోను కళాత్మకత రంగరించడం మల్లారెడ్డి గారికి వెన్నతో పెట్టిన విద్య.

పత్రికా రచయిత కాకముందే కరకు కత్తుల వంటి పద ప్రయోగాలతో ఆంధ్రలోకంపై విరుచుక పడ్డ కవి శ్రీ మల్లారెడ్డి. ఆయన ఊదిన 'శంఖారావం' అభ్యుదయ సాహిత్యోద్యమాన్ని ఒక ఊపు ఊపింది. శ్రీశ్రీ తర్వాత అంత వేడిగా, వాడిగా తెలుగులో వచన కవిత రచించిన వారు ఆయనొక్కడే అనడం అతిశయోక్తి కాదు. శ్రీశ్రీ కి అసలైన వారసుడుగా మల్లారెడ్డిగారిని భావించేవారు. కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని పరిపూర్ణంగా జీర్ణం చేసుకొని, వర్గ సంఘర్షణ పట్ల సంపూర్ణ అవగాహనతో,

> **ఈ ఏడాది రామానాయుడు అవార్డు గ్రహీత పరిచయం**

సమసమాజ నిర్మాణ ధ్యేయంతో మల్లారెడ్డి గారు తన కవితల ద్వారా తెలుగు సాహితీ లోకాన్ని తట్టి నిద్ర లేపారు అభ్యుదయ రచయితల సంఘాన్ని తనతోటి నడిపించారు. రాయలసీమ గొడ్డుకారం తిన్నందు వల్లనేమో ఆయన పద్యాల్లోని పదాలూ ఘాటుగా వుండేవి. వ్రాసింది రెండే రెండు కవితాసంపుటాలైనా . (మల్లారెడ్డి గేయాలు, శంఖారావం) అవి ఆధునిక కవితా రంగంలో అగణిత ప్రాచుర్యం పొందాయి. అనువాద కావ్యం మగ్గం కవిత్వం మల్లారెడ్డి గారికి తెలుగు భాషపై వున్న సాధికారాన్ని, కవిహృదయాన్ని తేటతెల్ల పరచింది

ఆయన చాలా ఆలస్యంగా పత్రికా రంగంలోకి ప్రవేశించారు. మూడు పదుల వయసులోనే పెనా చేతపట్టినా, అది కవిత్వం, విమర్శనాత్మక రచనలకు పరిమిత మైనది; 1970 లో ఆయన విశాలాంధ్ర వారపత్రిక సంపాదకత్వం స్వీకరించారు. 1975లో 'వీచిక' అనే సాహితీ మాసపత్రికను వెలువరించారు. మల్లారెడ్డి గారికి పత్రికా సంపాదకుడుగా గుర్తింపు, గౌరవం లభించింది- 1978లో 'ఈనాడు' ద్వారానే . తెలుగు పత్రికా రంగంలో తారాజువ్వలాగా దూసుకొని వచ్చిన ఆ పత్రికను ఆయన ఐదేళ్ళపాటు అద్భుతంగా నిర్వహించారు; ఆ పత్రికను ఆంధ్ర దేశంలోని ఇంటింటి పత్రికగా తీర్చి దిద్దడంలో మల్లారెడ్డి కృషి ఎనలేనిది. అప్పుడే ఆయన 'పుణ్యభూమి' శీర్షిక ద్వారా ప్రతి ఆదివారం వ్రాసిన విమర్శనాత్మక వ్యాసాలు ప్రతి తెలుగు పాఠకుడినీ ఉద్రేక పరిచేవి. రాజకీయ విమర్శను. అంత వాడిగా, వేడిగా చేసే పాత్రికేయులు చాలా అరుదు. అందులోనూ సమకాలీన పాలకులపై ఆటంబాంబుల వంటి పదాల తూటాలు పేల్చేందుకు చాలా ధైర్యం కావాలి

తరువాయి 7 పేజిలో



సాధు 'సుబ్బారాయుడు ఖద్దరు' గా నెల్లూరులో సుప్రసిద్ధమైన ఖద్దరు అంగడి యజమాని సాధు నరశింహారావు కుమార్తె అనూరాధ, బి.కాం; పాలేలు పున్నయ్య కుమారుడు వెంకట సత్యనారాయణ, యం.కాం. వీరి వివాహం 8 తేది నెల్లూరులో జరిగింది.

## మల్లారెడ్డి

(6 పేజీ కొరవ )

అది మల్లారెడ్డి గారి దగ్గర కొండంత వుంది.

'ఈనాడు' తర్వాత ఆయన 1983 లో ఆంధ్రభూమి సంపాదకత్వ బాధ్యతలు చేపట్టారు. తెలంగాణాకు, ఇంకా చెప్పాలంటే హైదరాబాదు సిటీకి మాత్రం పరిమితమై వుండి ఆంధ్రభూమిని ఆంధ్రరాష్ట్ర వ్యాప్తం చేసిన ఘనత మల్లారెడ్డి గారిదే.

'ఉదయం' దినపత్రిక యాజమాన్యం దాసరి నారాయణ రావు గారినుంచి మాగుంట సోదరుల చేతికి వచ్చిన తర్వాత ఉదయం ప్రధాన సంపాదకత్వ బాధ్యతలు స్వీకరించారు. రాజకీయ వాదులపైన, సంఘటనలపైన చురుకైన పదాలతో, తీక్షణమైన వాక్యాలతో ఆయన వేసే 'అక్షింతలు' పత్రికకే ఒక హైలైట్! తెలుగు దినపత్రికలలో ఇదొక నూతన ప్రయోగం!

మల్లారెడ్డి గారు రాయలసీమ బిడ్డ. కడప జిల్లా, పులి వెందులలోని అంకాలమ్మ గూడూరు ఆయన జన్మస్థానం. మల్లారెడ్డి గారికి సామాజిక విద్య తప్ప, స్కూలు చదువులేదు. ఏ డిగ్రీలు లేవు. ప్రాథమిక విద్యలో చదువు మానేసి, ఆ తర్వాత కాశీ విద్యాపీఠంలో హిందీ సాహిత్యం అధ్యయనం చేశారు. కాని, పిహెచ్‌డిలు చేసిన ప్రొఫెసర్ల కంటె పదునైన భాషా పరిజ్ఞానం సంతరించుకున్నారు. వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఆయనను 1986 లో గౌరవ డాక్టరేట్ తో సత్కరించింది.

మల్లారెడ్డి గారి రాజకీయ భావాలు స్థిరమైనవి. 1945 నుంచి ఆయన కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని బిగపోసిన పట్టుదలతో పాటు, పార్టీలో చురుకైన పాత్ర వహించారు. ఇప్పటికీ, పార్టీ సభ్యుడు కాదనే గాని, సిద్ధాంతం పట్ల విశ్వాసం ఇనుమంత తగ్గలేదు.

మల్లారెడ్డి గారు జనంలోనుంచి వచ్చిన కవి, రచయిత. తెలుగు పత్రికా రంగంలో ఆయన కృషి, సాధించిన విజయాలు అపారం. అందుకే ఆయనకు రామానాయుడు అవార్డు ప్రదానం.





## నెల్లూరు ముచ్చట్లు

ఏసీ స్టేడియంలో నంది అవార్డుల వితరణ; 8.30 కి రాజరాజేశ్వరి దేవాలయంలో కళ్యాణమండపం ప్రారంభోత్సవం; రాత్రి కి నెల్లూరు ముకాం. 5 వతేది ఉదయం దుగరాజపట్నంలో ఉప్పుటేరుపై ఎన్.టి.ఆర్. బ్యారేజి నిర్మాణ శంకుస్థాపన; తర్వాత కొండాపురం, వెళ్ళకూరు, గుమ్మ పాటిపాళెం, తుమ్మూరు, మిజారు వగైరా గ్రామాలలో కార్యక్రమాలు. సాయంత్రం 5 గంటలకు వెంగాళమ్మకు అర్చన. రాత్రికి వాకాడు. 6 వతేది ఉదయం మద్రాసో, హైదరాబాదో ఇంకా తెలలేదు.

### విమర్శలకు ఆస్కారమివ్వద్దు!

మెడికల్ కాలేజికి సంబంధించి మొన్న ఒక పత్రికలో వాకాడు నుంచి వచ్చిన వార్త అనుమానాలకు తావిస్తున్నది. కాలేజి నెల్లూరులో పెడతారని, స్థలాన్వేషణ కూడా జరుగు తున్నదని గతంలో వ్రాశాము. వాకాడు పత్రికా వార్త ప్రకారం మొదటి మూడు సంవత్సరాలు విద్యానగర్‌లో, చివరి రెండు సంవత్సరాల క్లాసులు నెల్లూరులో జరుగుతాయట. నెల్లూరులో కాలేజి భవనాల నిర్మాణానికి పెద్దాస్పత్రి స్థలంలో 65 ఎకరాలు తీసుకోబోతున్నట్లు కూడా ఆ వార్త కథనం.

ఈ సంవత్సరమే మెడికల్ కాలేజి పెడుతున్నారంటే, దానికి ఒక కమిటీ కూడా ఏర్పడితే, ముమ్మరంగా ప్రయత్నాలు జరుగుతున్న వంటే నెల్లూరీయులు ఎంతగానో సంతోషించారు. కాని మరలా వాకాడు పేరు వినబడేసరికి గుసగుసలు గొణుగుళ్లు ప్రారంభ మయ్యాయి. మా అనుమానం – ప్రదేశం విషయంలో స్థాపకుల మధ్యనే ఏకాభిప్రాయం లేదేమోనని! ఒకరి దృష్టిలో నెల్లూరు వుంటె మరొకరి ఆలోచనలో విద్యానగర్ వుందేమోనని మా వూహ.

విద్యానగర్‌లో ఆర్ట్స్ సైన్సు కాలేజి వుంది, ఇంజనీరింగ్ కాలేజి వుంది, ఇంకా అనేక విద్యా సంస్థలున్నాయి. మెడికల్ కాలేజి కూడా అక్కడే వున్నా మునిగి పోయేదేమీ లేదు. నిర్వహణ సౌలభ్యానికి, పరిపాలనలో పట్టుకు, విద్యా వాతావరణానికి ఇక్కడకు అక్కడకు తేడా వుంటుంది. విద్యాసంస్థల సముదాయంగా 'ఒక మినీ యూనివర్శిటీగా

కొరవ 8 పేజిలో

### పంచాంగము

**మే నెల తిథులు**

వైశాఖ బహుళ
తే 30 శని త్రయోదశి ప.గ. 11.40వ
తే 31 ఆది చతుర్దశి ప.గ. 10.50వ
జూన్ నెల :
తే 1 సోమ అమావాస్య ప.గ. 9.45వ
జ్యేష్ఠ శుద్ధ
తే 2 మంగళ పాడ్యమి ఉ.గ. 8.20వ
తే 3 బుధ విదియ ఉ.గ. 6.20వ
తరువాత పూర్తి విదియ
తే 4 గురు చతుర్థి రా.గ. 2.30వ
తే 5 శుక్ర పంచమి రా.గ. 11.45వ

స్వయంపాకుల శ్రీనివాసులు

**శ్రద్ధాంజలి** అనుమాలశెట్టి అన్నపూర్ణమ్మ గారు

20.5.92 తేది బుధవారం స్వర్గస్తురాలైనది. ఆమె ఆత్మకు చిరశాంతిని కలుగజేయుమని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

**ఉత్తరక్రియలు**

3.6.92 బుధవారం - పెత్తర్లు
4.6.92 గురువారం - వైకుంఠ సమారాధన

నెల్లూరు, ఫ్లోరిహాన్సన్ పేటలోని మా స్వగృహమున జరుగును. బంధుమిత్రులు తెలియగోరుతాము.

- పత్రి శివరామయ్య, సుబ్బరత్నమ్మ, గురూజి

## నెల్లూరు ముచ్చట్లు

పేజి కొనసా

పెంసిల్లీ జనాల మెంటునుంది. అయితే ఆ సెల్ జరగదు మాత్రం అది అప్పుడు ప్రకటం కాదు. మెడికల్ కాలేజి ప్రధానమైన అవసరమైన ఆస్పత్రులు అక్కడ లేవు. అన్ని రకాల ఆస్పత్రులు నెల్లూరులో మాత్రం వున్నాయి.



ఆస్పత్రులే కాదు. ఇతర వసతులు కూడా నెల్లూరులో సిద్ధంగా లభ్యమైనట్లు మరెక్కడా లేవు. అది కాక దంత కళాశాలను నెల్లూరులో నెలకొల్పగలనని జనార్ధన రెడ్డి గారు లోగడ స్పష్టంగా ప్రకటించారు గాని. విద్యానగర్ ప్రస్తావన తేలేదు. మెడికల్ కాలేజికి సంబంధించినంత వరకు ఆయన మనసులో నెల్లూరు వుందేమో ననిపిస్తుంది.

అన్నిటి కంటె ముఖ్యమైనది. ఈ సమయంలో ప్రధానంగా పరిగ ణనకు తీసుకోవలసింది జనార్ధన రెడ్డి అనే వరకు నలుమూలల నుండి వస్తే విమర్శల పరంపర. అప్పుడే సి.పి.ఐ నాయకులొకరు నిర్మొహ్యంగా పత్రికలలో విమర్శల వర్షం కురిపించారు. జనార్ధన రెడ్డి గారి శాశ్వత శత్రువు వుండనే వున్నారు – ఏమి దొరుకుతుందా దంతెత్తడానికి అని! చలివేంద్రాలు పెట్టలేక పోయినా. చలివేంద్ర కుండలకు చిల్లులు పొడవడానికి అలవాటు పడిన వారు మన వారు. విమర్శలతో. విష ప్రచారాలతో మెడికల్ కాలేజి ప్రారంభం కావడం వాంఛనీయం కాదు. సాధ్యమైనంత వరకు విమర్శ లకు ఆస్కార మివ్వకుండా చూసుకోవడం మంచిది.

నెల్లూరు టవున్ పరిసరాల్లో యాభై ఎకరాల స్థలానికి కొరత వుండదు. సింహపురి పబ్లిక్ స్కూలు టవున్‌కు దూరంగా పొదలకూరు రోడ్డులో అడవిలో వుంది. హాస్టలు తోటి జరుగుతున్నది. మెడికల్ కాలేజిని అడవిలో పెట్టమనడం మా వుద్దేశ్యం కాదు; టవున్‌కు దగ్గరలో మంచి ప్రదేశాలు కూడా వున్నాయి. ప్రయివేటు కోచింగ్ సెంటర్లు తమ సంస్థలకు నెల్లూరుకు చుట్టుపక్కల బ్రహ్మాండమైన భవనాలు నిర్మించుకో గలిగినపుడు మెడికల్ కాలేజికి మాత్రం తగిన స్థలం సంపాదించలేరా? కాలేజి స్థాపనకు ఐదు కోట్ల నిధులను సేకరించగలిగిన వారు. యాభై ఎకరాల స్థలాన్ని సమకూర్చుకోలేరా? మనసు వుంటే అది సాధ్యం కాని పనేమీ కాదు పద్మనాభ రెడ్డి గారి మనసు మాత్రం విద్యానగర్ మీద వున్నట్లుంది – కళ్ల ఎదుట వుంటుంది గదా!

మొదటనే వ్రాశాము – కమిటీ విషయంలో కూడా పునరాలోచన జరగడం బాగుంటుందని. సదుద్దేశ్యంతో యిచ్చిన సలహా అది. ప్రభువుల మనసుకు పట్టిందో లేదో మరి. మెడికల్ కాలేజి స్థాపన మూలంగా. మెడికల్ కాలేజి మూలంగా. జనార్ధన రెడ్డికి మంచి పేరు తప్ప చెడ్డ పేరు ఏ మాత్రం రాకూడదనేది మా ఆకాంక్ష

### టవున్‌లో జాండిస్

నెల్లూరు లో జాండిస్ ముంచి కొని వుంది. ప్రతి ఇంటో ఒక జాండిస్ రోగి వున్నాడా అనిపిస్తుంది. జాండిస్ కాదు, టైఫాయిడు, మలేరియాలు కూడా ముందుకొని వున్నట్లున్నాయి. అమ్మవారు, కూడా అక్కడక్కడ ప్రత్యక్ష మవుతున్నది.

జాండిస్ ఇంత తీవ్రంగా వుండడానికి వైరస్ కారణం అంటున్నారు; నీటి కాలుష్యమే కారణంగా వుంటుందని కూడా వైద్యులు అభిప్రాయ పడుతున్నారు. మునిసిపల్ ఆరోగ్యశాఖకు ఈ విషయం తెలుసా? నీటి కాలుష్య నివారణకు చర్యలేమైనా తీసుకున్నారా? పౌరుల ఆరోగ్యానికి సంబంధించిన ఇంత ముఖ్య విషయాన్ని ఎవ్వరూ పట్టించు కోవడం లేదెందువల్ల?

### ఎండలు

ఎండలు మండిపోతూ వున్నాయి. ఏ మాత్రం ఉపశమనం లేదు. నిప్పుల సెగలో వున్నట్లే వుంది వాతావరణం మరొక వారం ఇట్టే ఎండకాస్తే జిల్లా తీవ్రక్షామానికి గురయ్యేట్లు కన్పిస్తుంది. ఈ వారం నెల్లూరులో ఉష్ణోగ్రత వివరాలివి –

| తేది | ఫారెన్ హీట్ డిగ్రీలు |
|---|---|
| 23 | 110.3 |
| 24 | 110.4 |
| 25 | 101.3 |
| 26 | 105.8 |
| 27 | 104.0 |
| 28 | 105.1 |
| 29 | 105.4 |

### గూడూరు గ్యాస్ ఫిర్యాదు

గూడూరు గ్యాస్ డీలరు సిలెండర్ల సరఫరాలో అక్రమాలకు పాల్పడుతున్నాడని శ్రీ ఎన్.వి. శేషగిరి రావు ఫిర్యాదు చేస్తున్నారు. కొత్త సిలెండర్లు ఇంటికి సరఫరా చేయడం ఇతడికి అలవాటె లేదట; అంగడికి వచ్చి తీసుకపోవాలి. ఎప్పుడిస్తారో తెలిస్తే అట్లే చేయవచ్చు. కాని అది తెలియదు. రోజూ అంగడి చుట్టూ తిరగడం ఎవరికి సాధ్యం? ప్రయారిటీ నంబరు పేరుకే; పలుకుబడి ప్రకారం సిలిండర్లు తరలిపోతుంటాయి. ఫిర్యాదు చేస్తున్న శేషగిరి రావు ఏప్రెల్ 15 తేది బుక్ చేశాడట; ఇప్పటికీ సిలెండర్ రాలేదు. అడిగితే పెడసరంగా సమాధానం చెప్తున్నారట.

జాయింట్ కలెక్టర్ గారు – గూడూరు పౌరుల గోడు విన్పించుకోవాలి!

### గోపాలరావు పెళ్ళి ముహూర్తం

మా చిత్ర సమీక్షకుడు శ్రీ గిద్దలూరు గోపాలరావుకు నిజ జీవితంలో పెళ్ళి యోగం లేదు; అందువల్ల తెరపైనైనా ఆ సంబరం చూసి సంతోషిద్దా మనుకున్నాడేమో – 'పెళ్ళి ముహూర్తం' అనే నాటిక తనే వ్రాసి, దర్శకత్వం వహించి, తీశాడు. 1 తేది రాత్రి 7.50 గంటలకు ప్రసారమౌతుంది. అందరూ చూచి టివిపై అక్షింతలు వేయండి!

ఇందులో నటీనటులంతా నెల్లూరీయులే – కలెక్టరేట్ ఉద్యోగులు రాళ్లపల్లి రామసుబ్బారావు. బి. శ్రీధర్; రాళ్లపల్లి కృష్ణ ఫణీంద్ర. అక్కిరాజు, రఘురామయ్య. ఉషాకృష్ణమూర్తి. కె. వేణుగోపాల్. చెన్నూరు కృష్ణమూర్తి, కుమారి గంగారెడ్డి హేమరేఖ నటించారు. గోపాలరావు సరేసరి!

### రాజీవుని స్మృతికి పత్తిబాబు రక్తదానం

కలల్లో కనువిందు చేస్తున్న మునిసిపల్ ఛెర్ సుఖాసీనతకై తహ తహ లాడుతూ ఎన్నికలు ఎప్పుడెప్పు డాయని ఎదురు చూస్తున్న సాయినాథన్ సోదర ద్వయాగ్రజాడు పత్తి రవీంద్రబాబు. 21 తేది రాజీవ్ గాంధి వర్ధంతి సందర్భంగా ఎబిఎం ఆస్పత్రిలో తన స్వంత రక్తం దానం చేశారు; ఆయనతోటి మరి పాతిక మంది యువకులు ఈ కార్యక్రమంలో పాలు పంచుకున్నారు. తర్వాత ఎబిఎం. టిబి ఆస్పత్రులలో లెప్రసీ హోం; నిర్మల హృదయ భవన్‌లలో 800 మందికి పండ్లు పంచిపెట్టారు; తెరిసా హోంలోని. అనాథ బాల. వృద్ధులకు అన్నం పెట్టారు.

### నెల్లూరు బజారు

మొలగొలుకు

| | | |
|---|---|---|
| మొలగొలుకు | 9672 | 3000/- |
| | 9674 | 3300/- |
| | ఐ.ఆర్ 20 | 2500/- |
| | సున్నాలు | 2400/- |
| మొలగొలుకు బియ్యం 70 కి | | 425/- |
| బంగారు సవర 8 గ్రా | | 3160/- |
| వెండి 10 గ్రా | | 84/- |

### ఉపఎన్నికలు

( మొదటి పేజి కొరవ )

వందలాది జనం సమక్షంలో జరిగింది. ప్రక్కన కలెక్టరాది అధికార్లు . పోలీసులు. సిపిఎం నాయకుడు శ్రీ బోడెపూడి వెంకటేశ్వరరావు. పలువురు ఎమ్మెల్యేలు వున్నారు. కనీసం బోడెపూడి అయినా , ఇది నిజమే అయివుంటే. వెంటనే పత్రికల వారికి చెప్పివుండే వాడు కదా? చెంప దెబ్బతిని వుంటే. శివాజీ ఊరకుంటాడా? ముఖ్యమంత్రికి. ఆయనకు మధ్య. వాగ్వివాదం జరిగిన విషయం వాస్తవమే కాని. చెంప దెబ్బ లేసుకునేంత ఉద్రిక్తత ఏర్పడనే లేదని చెప్పారు. 'హిందు' వంటి ప్రతిష్ఠ కల్గిన పత్రికలో ఇటువంటి వార్త రావడం విస్మయం కల్గించే విషయం.

### పినాకినీ తీరం

- పేజి కొరవ

వరకు వ్యక్తమవుతున్న అభిప్రాయం హైదరా బాదులో కాంగ్రెస్ అనుకూలత వున్నదని. ఇద్దరూ గెలుస్తారని. అది వాస్తవమైతే "వద్దన్నా గెల్పిట్టున్నారు" అనే అభిప్రాయం సరైనదే ననుకోవలసి వస్తుంది. అంతకూ ముఖ్యమంత్రి అదృష్టమెట్టున్నదో !

# రొయ్యలసిరితో తీరగ్రామాలుకళకళ లాడబోతున్నాయి!

ఏ శుభముహూర్తంలో నెల్లూరు జిల్లాలో రొయ్యల పెంపకం ప్రారంభమైందో గాని, అది జిల్లా తీరప్రాంతం ఆర్థిక స్వరూపాన్నే మార్చివేస్తున్నది. వందల కోట్ల రూపాయల పెట్టుబడిని తెచ్చి సముద్రపు ఒడ్డున గుట్ట పోస్తున్నది. దేశ విదేశాలనుంచి పెద్ద పెద్ద కంపెనీలను, కుబేరులను పిలిపించి నెల్లూరు వీధులలో తిప్పుతున్నది. తడనుంచి తెట్టు వరకు 147 కిలోమీటర్ల సుదీర్ఘ తీరంలో రొయ్యల ఫారం ఏర్పడని గ్రామం మిగిలేటట్లు లేదు. ఉప్పు చవుడుతో, గట్టి ఇసుకతో, ఉప్పునీళ్ళ వెల్లువతో ఎందుకూ పనికిరానివిగా పడి వుండిన వేలాది ఎకరాల బీడు భూమి బంగారు బాతు గ్రుడ్లు పెట్టేదిగా పరిగణనకు వచ్చేసింది. ఒకటా, రెండా, మూడా - కొన్ని వందల కంపెనీలు రొయ్యల ఫారాలు అభివృద్ధి చేయడానికి వేలం వెర్రిగా నెల్లూరుకు ఎగబడుతున్నాయి. పెద్ద కంపెనీలే పాతిక వరకు వస్తున్నాయి.

వరకవిపూడిలో థాపర్ వాటర్ బేస్ లిమిటెడ్ (50 కోట్లు) తూపిలి పాళెంలో మాగుంట సోదరుల మాగుంట ఆక్వాఫార్మ్స్ లిమిటెడ్ (50 కోట్లు) మోమిడి ప్రాంతంలో సర్వారాయుడు చౌదరి గారి నవభారత్, కండ్లేటి ఒడ్డున జార్జి మెయిడ్ కంపెనీ, కృష్ణపట్నంలో టిసిఎల్, ఊటుకూరులో ఆల్ఫామెరైన్, వెంకన్న పాళెంలో శరత్ సీఫుడ్స్, రామతీర్థంలో ర్యాంక్ ఆక్వా ఎస్టేట్స్, అక్కడే కోస్టల్ మెరైన్ లిమిటెడ్, కోరూరులో ఆడిటర్ శ్రీ బోయిరెడ్డి గారి జల్ ఆక్వా ఫార్మ్స్... చెప్పుకుంటూ పోతే ప్రతి గ్రామంలోనూ ఒక్కొక్క పెద్ద కంపెనీ పేరు వినపడుతుంది. రెండు మూడేళ్ళలో ఇవన్నీ నిర్మాణం పూర్తి చేసుకుంటే, తీర గ్రామాలు పసిడి కేంద్రాలౌతాయి, బంగారు పండే భూములౌతాయి. కొన్ని వేల మందికి ఉపాధి దొరుకుతుంది. ప్రతి పెద్ద రొయ్యల ఫార్మ్ అనుబంధంగా ఏర్పడబోయే ఫీడ్, ప్రాసెసింగ్ వంటి పరిశ్రమల వల్ల స్థానికులెందరో జీవనోపాధి పొందుతారు. రహదారి రవాణా సౌకర్యాలు విస్తృతంగా అభివృద్ధి చెందుతాయి. ఒక్క మాటలో చెప్పాలంటే పల్లెటూళ్ళ స్వరూపమే మారిపోతుంది. పరిశ్రమలు ఏర్పడ లేదనే చింతతో వున్న నెల్లూరు జిల్లా వాసులకు రొయ్యల ఫారాలు ఆ కొరతను తీర్చబోతున్నాయి.

## ఎన్‌డిఆర్ పబ్లిక్ ఇష్యూ ప్రారంభం

మద్రాసుకు దగ్గరగా వుండడం, సముద్ర తీరంలో చవకగా వేలాది ఎకరాల భూమి లభ్యంగావడం పారిశ్రామిక కాలుష్యం లేని స్వచ్ఛమైన సముద్ర జలాలు లభించడం, వెల్లువలకు ఉప్పెనకు గురికాని రీతిలో సముద్ర తీరభూమి ఎత్తుగా వుండడం, నెల్లూరు టౌన్ నుంచి ప్రతి గ్రామానికి రహదారి సౌకర్యం వుండడం, తీర ప్రాంతంలో సాంఘిక పరిస్థితులు వ్యాపారానికనువుగా వుండడం, కార్మిక అశాంతి కన్పించక పోవడం, వ్యవసాయ కూలీల రేటు తక్కువ కావడం, పెద్ద పెద్ద కంపెనీలు నెల్లూరు వైపు ఆకర్షింపబడడానికి కారణ భూతాలౌతున్నాయి.

ఇప్పుడున్న కంపెనీలేలు కాకుండా, కొత్తగా శ్రీ నాయుడు దశరథ రామరెడ్డి సైతం రొయ్యల వ్యాపారంలో ప్రవేశించారు. కోడూరు, వెంకన్న పాళెంల మధ్య 300 ఎకరాల సువిశాల విస్తీర్ణంలో పన్నెండున్నర కోట్ల పెట్టుబడితో ఆయన రొయ్యల ఫా... అభివృద్ధి చేయబోతున్నారు. పబ్లిక్ ఇష్యూ కూడా విడుదల చేయబోతున్నారు.

నెల్లూరు నుంచి విడుదల కానున్న నాలుగైదు రొయ్యల కంపెనీల షేర్లలో దశరథ రామిరెడ్డి గారి కంపెనీయే ప్రప్రథమంగా ప్రజలలోకి వచ్చేటట్లున్నది. ప్రాజెక్టుకు అవసరమైన అప్పు సప్పులు, స్వంత పెట్టుబడి తదితరాలన్నీ ఏర్పాటై పోయాయి. నిర్మాణం శరవేగంగా జరుగుతున్నది. దశరథరామ రెడ్డి వ్యాపారంలో ఎంత 'గట్టి' వాడో తెలిసిందే కదా? పన్నెండు కోట్ల పెద్ద కంపెనీ అయినా ఆయనే ఓపికగా రోజూ వెళ్లి మట్టి ఎత్తే పని నుంచి సర్వం పర్యవేక్షిస్తున్నారు.

## శివారెడ్డి పద్యాలు

### రాజీవ్ గాంధీ

ఇండియాకు నీవు యిలవేల్పు రాజీవ!
పేదసాద పాలి పెన్నిధీవు
అప్రతిష్ఠ పేము, అనాటి నీ చావు
మరణ వార్త, యిదొక మాయని మచ్చ!

తప్పుజేసి నోణ్ణి తలదీసి పారేస్తె
తగ్గిన శిక్ష దాన్లే తప్పులేదు,
పట్టకెళ్లిజైల్లో బంధించి, ముప్పూట
పొందు మెరుగు జైలు వేయిరెట్లు!

నీకు సాటిమేటి నిన్నేలు నెరదాత
ఇండియాలో పుట్టడింక మీద
మరతుపాకి గుళ్ళ కెరయియ్యి రాజీవ
అంతరించి పోయె యింతలోన!

ఇందిరమ్మ బోయె, యిలవేల్పుగాంధిమ
హాత్ముడస్త్రమించె, అరిగెదివికి
నెహ్రూ పండితుడు, వినుగూడబలిగొంది,
మర తుపాకి తృటిలో మాయమైతి!

### కీ.శే. వెంకట్రామానాయుడు

రామానాయుని చరితము
ఆమూలాగ్రమ్ము కవికి, అంతా దెలును
ఏమని జెప్పుదు, అది యొక
రామాయణ మగును, జన్మరాహిత్యము!

### పద్యాలు

ఏమి కారణమ్ము, ఎందుగ్గపద్యాలు,
నప్పబడి పొయ్యాయి, అప్పటాల
వుండడంల, నిజమె వృద్ధాప్యమొచ్చాక
ప్రతిది యింతె, క్రొత్తపాఠకులకు!

### ఇండియా ఏమౌర్తి

ఉగ్రవాదులయిరి పూరూర, ఎలపాన
శంకి, కొడవలాయె, కాంగ్రెసోట్ల
కలత లెక్కువాయె, కర్మ! ఏమైపోద్ది
చెట్టచివరకింద్య, సిగ్గుచేటు!

## జనవాణి

3 పేజీ తరువాయి

...యులంటే నోరులేని వాళ్ళని వీళ్ళ తలంపా? ఇంతకు ముందు నెల్లూరులో వుండిన పోలీసు డిఐజి కార్యాలయాన్ని ఇదే ప్రకారం గూడూరుకు తరలించారు. ఒక్క నాయకుడు ఇదేమని అడగ లేదు. ఇప్పుడూ అంతే! నెల్లూరీయుడు ముఖ్యమంత్రిగా వున్నప్పుడు నెల్లూరుకి అన్యాయం జరగడం క్షమార్హం కాదు. జనార్ధనరెడ్డి గారు జోక్యం చేసుకొని తిరిగి ఈ కార్యాలయాన్ని నెల్లూరులో నెలకొల్పేటట్లు చూడాలి!

—ఎవోశెపగిరిరావు

విజయవాడ

చేసినట్లు ప్రభుత్వం ప్రకటించింది. రాత్రికి రాత్రి టెలిగ్రామ్ మీద ఆఫీసును తరలించి వేసినట్లు పత్రికలలో వార్త వచ్చింది. ఏమిటీ అన్యాయం? నెల్లూరంటే హైదరాబాదు అధికార్లకు ఎందుకింత అలుసు? రీజినల్ జాయింట్ డైరెక్టర్ పదవి రద్దు చేయాలనుకుంటే, అందుకు నెల్లూరే కన్పడిందా? నెల్లూరి...

# సంస్మరణ



స్వర్గీయ పూండ్ల చెంచురెడ్డి

సమతావాది, బంధుజన ప్రియుడు,
మా అభ్యున్నతికి కారకుడు

## స్వర్గీయ పూండ్ల చెంచురెడ్డి

మరణించి, 27.5.1992 తేదికి నాలుగు సంవత్సరములు నిండాయి.

నాల్గవ వర్ధంతి సందర్భంగా శోక తప్త హృదయంతో ఆశ్రునయనాలతో వారికి శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

శ్రీమతి పూండ్ల కామేశ్వరమ్మ – భార్య

డా. పూండ్ల శ్రీనివాసులు రెడ్డి, పూండ్ల వెంకురెడ్డి - కుమారులు

శ్రీమతి పూండ్ల దేవశేన, శ్రీమతి పూండ్ల అరుణ - కోడళ్లు

షాలిని, వినీల, సరిత – మనుమరాండ్రు

సతీష్ – మనుమడు

# తారల మాటలకు అర్థాలేవేరులే!

ఇటీవల కొందరు తారలు హడావిడిగా 'ప్రెస్‌మీట్'లు ఏర్పాటుచేసి, స్టేట్‌మెంట్లు ఇవ్వడం మామూలై పోయింది. వాటిని అసలు అర్థంలో అర్థం చేసుకోనెందుకు పాఠకులూ అలవాటై పోయారు. అవి ఎలా ఉంటాయంటే–

"నా కసలు సినిమాల్లో చేరాలనే ఉద్దేశ్యమూ, అవసరమూ లేదు. తలవని తలంపుగా నటినైపోయాను. ఏదో ఫంక్షన్‌లో ఫలానా డైరెక్టరు అనుకోకుండా నన్ను చూసి సినిమాలలో

## మద్రాసు సినిమా వార్తలు

నటిస్తావా అనని అడిగారు" అంటేఆమె సినిమాలలో ప్రవేశించడానికి ఇదివరకే ఎన్నో సినిమా కంపెనీల చుట్టూ కాళ్ళరిగిపోయేట్లు తిరిగి అలసి పోయిందన్నమాట!)

"ఇటుపైన మంచి కథ, మంచి పాత్రలు ఉంటేనే ఒప్పుకోవాలనే నిర్ణయానికి వచ్చాను" అంటే ఆమె ఆ వారం కనీసం రెండు మూడు రేప్ సీన్‌లలో అయినా నటించి ఉండాలి.

"కథ కోర్టీ నిజంగా అవసరమైతే, స్విమ్మింగ్ దుస్తులతో నటించడానికి కూడా సిద్ధమే" అంటే ఆమె ముఖానికి రంగుపూసుకుని చాలా కాలం అయి ఉండాలి

"తమిళంలో 8, మలయాళంలో 7, కన్నడంలో 6 చిత్రాలలో చేస్తున్నాను" అంటే, తెలుగులో ఒక్క చిత్రమైనా లేదన్నమాట!

"నా పెళ్ళికి అప్పుడేం తొందర?" అంటే ఆమెకు త్వరలో పెళ్ళి జరగవచ్చున్నమాట.

"ఇప్పుడు ట్రేలో కాఫీలు తెచ్చిన అమ్మాయి మా అక్క కూతురు" అంటే ఆ పాప ఆమె కూతురైనా ఆశ్చర్యపడనక్కర్లేదు".

"ఇప్పుడు తీరుబడి లభిస్తే హిందీ నేర్చుకుంటాను" అంటే త్వరలో రేటు పెంచబోతూందన్న మాట

"నేనిటుపైన తక్కువ చిత్రాలే ఒప్పుకుంటాను" అంటే ఆమెకు సినిమా ఛాన్సులు బాగా తగ్గాయన్నమాట!

### అత్యాశ లేని నటి

"గాంధి" చిత్రంలో కస్తూరిబాగా అసమాన చాతుర్యంతో నటించిన రోహిణి హట్టంగడి "సీతారామయ్యగారి మనమరాలు" చిత్రంలో అక్కినేని సరసన నటించి, మన

(కొరవ 13 పేజీలో)



రోషి చిత్రంలో రాంకీ, యస్‌పి బాలసుబ్రహ్మణ్యం

# విశ్వామిత్రను రిపేర్ చేస్తారట!

"బ్రహ్మర్షి విశ్వామిత్ర" చిత్రం ఎందుకు ఆశించినంత విజయం సాధించలేదో అంతుబట్టలేదు ఎన్.టి.ఆర్‌కి. ఆ చిత్రాన్ని రెండు మూడు సార్లు చూసి పోస్టుమార్టమ్ చేస్తే, శకుంతలోపాఖ్యానం తెలిపోయినట్లు నిపించిందంట. ఆ సీన్‌లు తిరగరాయించి, శకుంతల, దుష్యంతుల పాత్రలను వేరే నటీనటుల చేత చిత్రీకరించి ఇంకా విడుదల కాని హిందీ, తమిళ వర్షన్‌లలో జోడించే తలంపులో ఉన్నారట. వెల్డింగ్, రిపేర్ చేశాక గాని విడుదల చేయరట. అదీ ఎన్.టి.ఆర్. పట్టుదల.

### పుష్పవల్లి ఇక లేదు.

ఎన్నో ఏళ్ళ క్రితం "సంపూర్ణ రామాయణం" చిత్రంతో సినిమా రంగంలో ప్రవేశించిన అలనాటి అందాల

(కొరవ 13 పేజీలో)

# కోడి రామకృష్ణపై కోప్పడి లాభం?

హైదరాబాదులో స్వప్రయోజనం కోసం స్థిరపడిన ఏ కొద్దిమంది నిర్మాతలకో ఉపకరించే ఉద్దేశ్యంతోనే సబ్సిడీలు, రాయితీలను రాష్ట్ర ప్రభుత్వం కల్పించిందని డైరక్టర్ కోడి రామకృష్ణ ఏ దుర్ముహూర్తంలో అన్నాడోగాని, ఆ ఆరోపణలు రాష్ట్రంలో చలన చిత్ర పరిశ్రమాభివృద్ధికి ఆటంకం కల్గించే రీతిలో ఉన్నాయని రాష్ట్ర చలన చిత్ర వాణిజ్య మండలి అభిప్రాయపడింది. ఈ విమర్శలు పత్రికలలో అచ్చయి రచ్చకెక్కినందున వాణిజ్య మండలి సభ్యుల తరపున ఆ దర్శకునికి వృత్తిపరమైన సహాయాన్ని ఇవ్వడానికి ఎందుకు నిరాకరించకూడదో తెలుప వలసిందిగా సంజాయిషీ కోరుతూ ఒక నోటీసు పంపబడింది. దీనికి ఆ దర్శకుని ప్రతిస్పందన ఏమిటో త్వరలో తెలుస్తుంది. ఈ ఆరోపణలు గతంలో చాలా మంది చేశారు. అప్పుడు ఏ మాత్రం పట్టించుకోని వాణిజ్యమండలి హఠాత్తుగా ఇప్పుడు కోడి రామకృష్ణ విషయంలో మాత్రం ఇంతటి చర్య ఎందుకు తీసుకుందో దురూహ్యంగా ఉంది.

### "అత్తసొమ్ము –అల్లుడుదానం.

కాస్త క్లిష్టమైన అత్త పాత్ర ఉంటే, వాణిశ్రీనే బుక్ చేస్తున్నారు. వై.నాగేశ్వర రావు దర్శకత్వంలో శ్రీబాబా సినీ ఎంటర్‌ప్రైజస్ నిర్మించే "అత్తసొమ్ము–అల్లుడిదానం" చిత్రంలో వినోద్‌కుమార్, వాణిశ్రీ, రోజా, సత్యనారాయణ, కోట శ్రీనివాసరావు, రాళ్ళపల్లి, బాబూ మోహన్, శ్రీహరి, నాగేందర్ గౌడ్ పాత్రధారులు. స్క్రీన్‌ప్లే: కొమ్మనాపల్లి గణపతిరావు. మాటలు: తనికెళ్ళ భరణి. నిర్మాత: నాగేంద్రగౌడ్.

# రామకృష్ణ హెగ్డే నటుడైనాడు!

కర్నాటక మాజీ ముఖ్యమంత్రి జనతాదళ్ నాయకుడు రామకృష్ణ హెగ్డే రాజకీయ రంగం నుంచి సినిమా రంగంలోకి దూకబోతున్నారు. "మరణమృదంగ" అనే కన్నడ రాజకీయ వ్యంగ్య చిత్రంలో ఆయన ముఖ్యమంత్రిగానే నటించబోతున్నారు. రాజకీయ రంగంలో ఆరితేరిన వారికి నటించడం ఏమంత కష్టంకాదు. గతంలో హెగ్డే ఎం.ఎల్.ఏగా ఉన్నప్పుడు బెంగళూరులో జరిగిన మారువేషాల పోటీలలో కొన్ని బహుమతులు దక్కించుకున్నారు కూడా. ఈ చిత్రంలో మాలాశ్రీ నాయిక.

### "నిప్పురవ్వ" భారీ చిత్రం

ఎ. కోదండరామిరెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో యువరత్న ఆర్ట్స్ 70 ఎం.ఎం. స్టీరియోఫోనిక్ సౌండ్‌లో భారీ ఎత్తున నిర్మిస్తున్న "నిప్పురవ్వ" చిత్రం మూడు వంతులకు పైగా తయారైంది. బొగ్గుగని కార్మికుడుగా నటించే బాలకృష్ణ నాయిక విజయశాంతి పై ఆస్ట్రేలియాలోని సెల్‌బర్గ్, వియన్నాలలో చిత్రీకరించిన రెండు పాటలు ఈ చిత్రంలో హైలైట్స్. లక్ష్మి, సుజాత, గీత, కస్తూరి, బేబీషామిలి, అమ్రీష్‌పురి, కన్నడ ప్రభాకర్, మోహన్‌రాజ్, బాబూ ఆంథోని, సెంథిల్, అల్లురామలింగయ్య ఇతర పాత్రధారులు. కథ, మాటలు: పరచూరి బ్రదర్స్, సంగీతం: బప్పిలహరి.

## మొగుడు, పెళ్ళాలందరూ చూడాల్సిన చిత్రం

# పెళ్ళాం చెపితే వినాలి

**చిత్రసమీక్ష**
*గ్రిధలూరు గోపాలరావు*

"పెళ్ళాం చెపితే వినాలి" ఈ పేరు చాలా ఇంపుగాను సొంపుగాను వుంది. ఆకర్షణీయంగాను వుంది. అన్ని రకాల ప్రేక్షకులను అలరించి, ఆకర్షించే అయస్కాంతంలా వుంది. అంతే కాదు. ఇందులో వ్యక్తిత్వమూ వుంది. ఆసక్తితో ఆలోచన రేకెత్తించే అంశమూ వుంది. మగాళ్ళు పాటించవలసిన సలహా వుంది. ఆడవారికి ఒక బాధ్యతను గుర్తు చేస్తూ వుంది. "కార్యేషు మంత్రి" అని అలనాడు సంస్కృతం మున్మురంగా చలామణిలో వున్న రోజుల్లోనె అన్నారు, కులపత్నిని గూర్చి.

సంసార నౌకను నడపటంలో, సంసారం సంపాదన పెంచటంలో మొగుడు, పెళ్ళాలు ఒకరినొకరు సంప్రదించుకుంటూ, ఒకరి సలహాలను ఒకరు పాటిస్తూ వుంటే సంసారం మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లుతుంది. అది నిజమే కాని పెళ్ళాం మాట వినే మొగుళ్ళు ఎంత మందున్నారు? పెళ్ళాం మాట పాటిం చేందుకు పురుషాధిక్యత అడ్డుపడుతూ వుంటుంది.

"పెళ్ళాం చెపితే వినాలి" - అని పేరు పెట్టుకున్న ఈ చిత్రం "అసలు మనవంశంలో పెళ్ళాం చెప్పిన మాటలు విని బాగుబడ్డవాడు లేడు" అందువల్ల "మొగుడు చెప్తేనే వినాలి" అన్న పురుష అహంకారంతో కూడుకున్న విషయంతో ప్రారంభ మవుతుంది. ఈ చిత్రానికి మూల పురుషుడైన తండ్రి (కృష్ణ) తన నలుగురు కొడుకులకూ ఈ బోధ చేస్తాడు. దీని, ఫలితంగా మగాళ్ళంతా ఒక జట్టుగా చేరి ఆడవాళ్ళను అణచిపెడ్తారు. పురుషాధిక్యతను ప్రకటించు కుంటారు. అసహాయ స్థితిలో వున్న ఆడవారికి ఒక పెద్దమనిషి (మురళీమోహన్) ఆధారంగా నిలవటంతో ఆడవాళ్ళు కాళ్ళు

(కొరవ 13 పేజీలో)

# 10 తరగతిలో మూడు స్కూళ్లకు గుండుసున్న

నెల్లూరు జిల్లాలోని వివిధ స్కూళ్ల 10 వ తరగతి ఫలితాలు దిగువ యిస్తున్నాము. బ్రాకెట్లోనివి ఫస్ట్ క్లాసులు

నెల్లూరు టౌన్‌లో నాలుగు; గూడూరు, కావలి, వరగలి, గండిపాళెం, లక్ష్మీపురం, కోట, ఐస్కపల్లి, హైస్కూళ్లు నూటికి నూరు శాతం ఫలితాన్ని సాధించాయి.

అయ్యవారి పాళెం, వెంబేడు, మర్రిపాడు స్కూళ్లు 'సున్న' శాతం ఫలితాన్ని సాధించాయి.

| స్కూలు | హాజరైన వారు | ఉత్తీర్ణులైన వారు | శాతం |
|---|---|---|---|
| **నెల్లూరు టవున్** | | | |
| సర్వేపల్లి రాధాకృష్ణ | 35 | 35(31) | 100 |
| శారద అంగ్లము | 30 | 30(22) | 100 |
| శాంతినికేతన్ | 21 | 17(14) | 81 |
| సెంట్ జోసఫ్ (గరల్స్) | 130 | 96(60) | 74 |
| దర్గామిట్టజి.వ | 66 | 48(10) | 73 |
| ఎ.సి.నగర్ | 141 | 89(44) | 63 |
| ప్రత్తివారి స్కూలు | 70 | 32(12) | 46 |
| జండావీధి | 70 | 30(9) | 43 |
| సెంట్‌పీటర్సు | 244 | 86(30) | 37 |
| టి.వి.యస్ | 240 | 87(27) | 36 |
| వెంకటేశ్వరపురం | 31 | 11(1) | 35 |
| **ఇతర స్కూళ్లు** | | | |
| గూడూరు ఎస్‌యంజి | 65 | 65(43) | 100 |
| కోట | 32 | 32(32) | 100 |
| గండిపాళెం | 67 | 67(67) | 100 |
| కావలి సెంట్ ఆన్స్ | 70 | 70(64) | 100 |
| వరగలి | 17 | 17(17) | 100 |
| లక్ష్మీపురం | 10 | 10(4) | 100 |
| గుంపర్లపాడు | 19 | 18(6) | 99 |
| తుమ్మలపెంట | 65 | 64(62) | 98 |
| కోట (బాలురు) | 27 | 25(12) | 93 |
| ముత్తుకూరు (బాలికలు) | 68 | 61(38) | 90 |
| చిపినాపి | 9 | 8 | 89 |
| తాడిపత్రి | 42 | 36(10) | 86 |
| చిట్రగుంట | 42 | 36 | 83 |
| నిడిగల్లు | 23 | 19(2) | 83 |
| వావిళ్ల | 24 | 20(4) | 83 |
| కాకొల్లువారిపల్లె | 16 | 13(1) | 81 |
| మరమనూరు | 30 | 24(7) | 80 |
| పొట్టుకూరు | 30 | 24(9) | 80 |
| గుండెమడకల | 29 | 23(4) | 79 |
| జలదంకి | 28 | 22(4) | 78 |
| నందవరం | 27 | 21(7) | 78 |
| కొడవలూరు | 91 | 69(28) | 76 |
| దమ్మాయిపాళెం | 22 | 16(7) | 73 |
| కావలి యడవల్లి | 35 | 25(3) | 71 |
| కండ్లేరు | 62 | 44(12) | 71 |
| దుత్తలూరు | 49 | 35(9) | 71 |
| గండిపాళెం | 33 | 23 | 70 |
| పరికుంటపాడు | 61 | 43(6) | 70 |
| చిన్నపల్లిపాళెం | 41 | 28(9) | 68 |
| బ్రాహ్మణపల్లి | 12 | 8(5) | 67 |
| సీతారామ పురం | 101 | 68(19) | 67 |
| బాలిరెడ్డిపాళెం | 24 | 16(4) | 67 |
| మేనకూరు | 25 | 16(4) | 64 |
| ఎ.ఎస్.పేట | 56 | 36(9) | 64 |
| అన్నారెడ్డి పాళెం | 35 | 22(6) | 63 |
| సంగం | 103 | 65(19) | 63 |
| అయ్యవారిపల్లి | 58 | 34(4) | 63 |
| కలిగిరి | 51 | 31(2) | 61 |
| పులటోట | 22 | 13(3) | 59 |
| వాకాడు | 59 | 35 | 59 |
| కొత్తపాళెం | 22 | 13(4) | 59 |
| పెద్దరెడ్డి పల్లె | 12 | 7 | 58 |
| సైదాపురం | 86 | 50(6) | 58 |
| కంపసముద్రం | 14 | 8(3) | 57 |
| తిమ్మరాజు పల్లె | 26 | 15(2) | 57 |
| గొట్టిప్రోలు | 7 | 4 | 57 |
| గ్రిద్దలూరు | 7 | 4 | 57 |
| విరువూరు | 14 | 8(1) | 57 |
| ఉదయగిరి | 125 | 71(36) | 57 |
| దగదర్తి | 39 | 22(8) | 56 |
| కసుమూరు | 27 | 15(1) | 56 |
| కలువాయి | 160 | 88(24) | 55 |
| ఆర్మేనిపాడు | 37 | 20(3) | 54 |
| మనుబోలు | 50 | 27(6) | 54 |
| కుల్లూరు | 50 | 27(6) | 54 |
| దుత్తూరు | 36 | 19(7) | 53 |
| కావలి (బాలికలు) | 147 | 78(42) | 53 |
| గండవరం | 59 | 30(3) | 51 |
| విద్యానగర్ | 107 | 55(18) | 51 |
| బుచ్చి (బాలికలు) | 80 | 39(15) | 49 |
| వాకాడు | 41 | 20(3) | 49 |
| కావలి 8 వ వార్డు | 49 | 21(6) | 48 |
| రాపూరు | 217 | 104(14) | 48 |
| టియంచిట్రగుంట | 80 | 37(12) | 46 |
| పూడిపర్తి | 26 | 12 | 46 |
| వెలబల్లి | 20 | 9(4) | 45 |
| గునపాడు | 34 | 15(1) | 44 |
| ఓజిలి | 55 | 24(5) | 44 |
| నర్రవాడ | 29 | 13(1) | 44 |
| కొడిమెర్ల | 20 | 9(2) | 45 |
| వెంగళరావు నగర్ | 25 | 10(1) | 40 |
| యల్లాయపాళెం | 114 | 48(9) | 42 |
| పల్లిపాడు | 34 | 15(4) | 44 |
| పాల్పూరు | 7 | 3 | 43 |
| అల్లూరు | 178 | 76(25) | 43 |
| ముత్తుకూరు | 121 | 49(17) | 40 |
| ఇందుకూరుపేట | 150 | 62(16) | 41 |
| చిట్టేడు | 97 | 40(5) | 40 |
| రేబాల | 40 | 16(2) | 40 |
| విడవలూరు | 164 | 65(9) | 40 |
| పొట్టుకూరు | 28 | 11(5) | 39 |
| సిద్ధనకొండూరు | 35 | 13(3) | 37 |
| సూళ్లూరుపేట | 173 | 63(15) | 36 |
| నాయుడుపేట (బాలికలు) | 116 | 44(18) | 38 |
| బసినేనిపల్లి | 23 | 9 | 39 |
| తల్లంపాడు | 31 | 12(5) | 39 |
| మన్నారుపోలూరు | 94 | 33(7) | 35 |
| చిల్లమానుచేను | 22 | 8(2) | 36 |
| వెంకన్నపాళెం | 19 | 10(1) | 33 |
| చెన్నూరు (బాలురు) | 160 | 52(11) | 33 |
| చెన్నూరు (బాలికలు) | 53 | 19(1) | 36 |
| వంజివాక | 20 | 7 | 35 |
| కోట బాలికలు | 68 | 24(5) | 35 |
| కోట బాలురు | 123 | 42(11) | 34 |
| చిలకపాడు | 9 | 3 | 33 |
| మల్లాం | 36 | 12 | 33 |
| కావలి ఎచియం | 118 | 37(12) | 32 |
| పెనుబల్లి | 38 | 12(4) | 32 |
| బుచ్చి | 255 | 85(25) | 33 |
| మినగల్లు | 20 | 6 | 30 |
| అరవపాళెం | 68 | 20 | 29 |
| పాతచిట్రగుంట | 18 | 5 | 28 |
| నాగులవెల్లటూరు | 11 | 3(1) | 27 |
| వెంకటగిరి | 87 | 24(4) | 27 |
| కోటపోలూరు | 95 | 27(6) | 28 |
| అన్నమేడు | 8 | 2 | 25 |
| పెళ్లకూరు | 13 | 3 | 23 |
| చిల్లకూరు | 110 | 24(7) | 22 |
| చిట్రగుంట | 63 | 14(2) | 22 |
| గూడూరు (బాలురు) | 218 | 42(24) | 19 |
| బ్రాహ్మణకాక | 46 | 10 | 21 |
| చింతవరం | 33 | 6(1) | 18 |
| నాయుడుపేట | 136 | 21(15) | 15 |
| రోసనూరు రాజాపాళెం | 8 | 1 | 12 |

## ప్రతిద్వంది

(4 పేజీ తరువాయి)

నవలలో సిద్ధార్థ ప్రధాన పాత్ర అయినా, మిగతా పాత్రలకు సంబంధించిన వర్ణనలు, వివరణలు విపులంగా వుంటాయి. చిత్రం అట్లాకాదు; కేవలం సిద్ధార్థనే కేంద్రంగా తీసుకొని నడుస్తుంది. సిద్ధార్థ మానసిక స్థితిని, వ్యక్తిత్వాన్ని వివరించడానికి మాత్రమే మిగతా పాత్రలను ఉపయోగిస్తారు. అవి ఛాయామాత్రంగా కనిపిస్తాయి. ఐనా సజీవంగానే కదుల్తాయి. పదిమాటల్లో చెప్పేభావాన్ని ఒకే ఒక్క కదలికలో చూపుతాడు దర్శకుడు. సిద్ధార్థ చెల్లెలు - సుతపనే తీసుకొందాం. ఆమె సంపాదన మీద ఆ కుటుంబం ఆధారపడి వుంది. అందువల్ల ఆమెలో కాస్త నిర్లక్ష్యం, స్వేచ్ఛాభావం కలుగుతాయి. ఆ అభిప్రాయం ప్రేక్షకుల్లో కలిగించడానికి దర్శకుడు ఒక్కపాటినే ఉపయోగించుకున్నాడు. ఆమె ఆలస్యంగా ఇంటికిరావడం, విసుగ్గా, అలసటగా, ఎవర్నీ లెక్కచెయ్యకుండా తనపాటికి తాను గదిలోకి వెళ్ళడం - ఇందులో ఆ పాత్ర మనస్తత్వాన్నంతటినీ పొదుగుతాడు.

కేయా పాత్రకూడా సిద్ధార్థ కోసమే సృష్టించబడ్డట్టు మలచబడింది. నవల ప్రారంభంలోనే వాళ్ళిద్దరి పరిచయంవుంది. కాని చిత్రంలో సిద్ధార్థ మానసికాందోళన మరొక మలుపు తిరగాల్సినచోట మాత్రమే ఆమెను కథలోకి వస్తుంది.

సుతప ఒకరోజు యింటికి రాదు. ఆమె కోసం సిద్ధార్థ వెతుకుతాడు. మర్నాడు ఆమె కొందరు రౌడీలతో ఒక గదిలో విచ్చలవిడిగా వుండటం చూస్తాడు. ఈ సంఘటన చిత్రంలో లేదు. నిజానికిది చాలా పటుత్వం కల్గిన సన్నివేశమే. ఐనా సత్యజిత్ రాయ్ దీన్ని ఉపయోగించుకోలేదు. అందుకు నాకు తోచిన కారణమిది- సుతప వ్యవహారం సిద్ధార్థను చాలా వేధించింది. ఆమె ప్రవర్తనవల్ల అతనిలో ఆత్మ విశ్వాసం లోపించడం, ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సు వగైరాలు ఏర్పడ్డాయి. అంతవరకే కథకు సుతప కావాలి. ఆ తర్వాత ఆమె రౌడీలతో వుండటమన్నది సిద్ధార్థ పాత్రను కాని, సుతప పాత్రనుకానీ మరింత విశదపరచే సన్నివేశంకాదు. కాబట్టి దాన్ని తొలగించాడేమో దర్శకుడు అనుకొంటున్నాను.

అట్లాగే కేయా తండ్రి సిద్ధార్థను అవమానించే దృశ్యంకూడా చిత్రంలో లేదు. సిద్ధార్థ మీద సత్యజిత్ రాయ్‌కి వున్నంత సానుభూతి నవలాకారుడు సునీల్ గంగూలీకి లేదేమోననిపిస్తుంది. సునీల్ అతన్నొక పాత్రగా మలిచాడు; సత్యజిత్ అతన్నొక తరానికి ప్రతినిధిగా రూపొందించాడు.

ఇంకొక్క విషయం చెప్పాలి. సాధారణంగా మనకొక సంఘటన ఎదురైనప్పుడు అనుకోకుండా చిన్నప్పటి సన్నివేశం ఒకటి గుర్తుకురావడం జరుగుతుంటుంది. తమ్ముడితో మాట్లాడుతుంటే చిన్నప్పుడు ఇద్దరూ కలసి బడికి వెళ్ళడమో, ఆడుకోవడమో ఒక ఫ్లాష్‌లాగ మన స్మృతిపథంలోకి వస్తుంటుంది. దాన్ని సత్యజిత్‌రాయ్ చక్కగా ఉపయోగించుకున్నారు. సిద్ధార్థ తమ్ముడు తనతో మాట్లాడుతుంటే ఉన్నట్టుండి చిన్నవాటి సన్నివేశాన్ని ఒకదానిని చూపుతాడు. ఒక్కక్షణం; అంతే మళ్ళీ కథలోకి వచ్చేస్తాడు. మానవనైజాన్ని ఎంతో సునిశితంగా అర్థం చేసుకున్న దర్శకుడికే ఆ అవగాహన వుంటుంది. 'ఫ్లాష్‌బ్యాక్' అంటే ఏమిటో ఈ చిత్రంచూచి నేర్చుకోవాలి మనవాళ్ళు.

సినిమాల్లో రెండు రకాలు- కొన్ని అంతస్సంఘర్షణను వ్యక్తంచేసేవి; మరికొన్ని బాహ్య సంఘర్షణనుచిత్రీకరించేవి. మొదటి రకంలో వ్యక్తి ప్రధానం; రెండవ రకంలో సమాజం ముఖ్యం. మన తెలుగు చిత్రాల్లో రెండూ వుండవనుకోండి; అది వేరే విషయం 'ప్రతిద్వంది' లో ఈ రెండూ సున్నితంగా మేళవింపబడ్డాయి. వ్యక్తిని సమాజ వర్గప్రతినిధిగా చూస్తూ, అతని మానసిక స్థితిని, ఆలోచనా సరళిని ఆవర్గానికి అన్వయింపచేయడం జరిగింది.

'ప్రతిద్వంది' చూచి వెలుపలికి రాగానే ఒక మిత్రుణ్ణి అడిగాను- ఇందులో సంగీతం ఎట్లావుంది? అని! అతడు నాలిక్కరచు కున్నాడు. 'సంగీతం సంగతే నేను గమనించలేదే!' అన్నాడు. అదే 'ప్రతిద్వంది' గొప్పదనం. ఆ చిత్రానికి సంగీతం, నటన, కెమెరా, ఎడిటింగ్, సంభాషణలు అన్నీ అవయవాలు. అన్నీ బాగుండబట్టే చిత్రం బాగుంది. అందులో ఏ ఒక్కటి బాగున్నట్టు తోచినా చిత్రం బాగాలేదని అర్థం.

'ప్రతిద్వంది' లాంటి చిత్రాన్ని చూడ్డం ఒక దివ్యమైన అనుభూతి. సత్యజిత్ రాయ్ మన సమకాలికుడు కావడమే మనకు గొప్ప. ఆ మహనీయుడికి రెండు చేతులూ ఎత్తి నమస్కరిస్తున్నాను.

(9-8-74 'జమీన్‌రైతు' నుంచి)



బొమ్మా సుందరరామరెడ్డి కుమారులు – ఎడమ: బి. సుధీర్ – స్నేహలత; కుడి. సురేష్ – విజిత వీరి వివాహాలు మే 6 తేది నెల్లూర్లో జరిగాయి

## చిత్రసమీక్ష

(9 పేజీ కొరవ)

విలవిల్లాడుకుంటారు. ఆ ఇంటి కోడళ్ళు భర్తల మీద, మామ మీద తిరుగుబాటు చేస్తారు. భార్యలు సహకార నిరాకరణ ఉద్యమం ప్రారంభిస్తారు. "పెళ్ళాం చెపితే వినాలి" అనే నినాదం వినిపిస్తారు. ఇది యిలా సాగుతూవుండగా, ఈ చిత్రం ఒక మంచి పనిచేస్తుంది. పెళ్ళాం మాటలు మొగుడు వినకుండా, మొగుడి మాటలు పెళ్ళాం వినకుండా ఎవరి దారి వారిదే అనుకున్నప్పుడు, మొగుళ్ళు, పెళ్ళాలు ఎదుర్కొనే సమస్యలు, అనుభవించే అవస్థలు చూపుతుంది. ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ అనుకోకుండా మొగుడు పెళ్ళాలిద్దరూ ఒకరి మాట ఒకరు వినాలి, బాగుపడాలి – అనే రీతిని బోధిస్తుంది.

ఇదే కాకుండా వరకట్నం పై దురాశ కొంత చూపబడింది. డబ్బుకోసం కోడల్ని హింసించటం, హత్యాప్రయత్నం, హత్యానేరం, అరెస్టులు వగైరా మామూలు ధోరణిలో వున్నాయి. వినోదం, హాస్యము, అహ్లాదాన్ని అందిస్తాయి.

దర్శకుడు కోడి రామకృష్ణ అన్నీ సక్రమంగా అమర్చి సకుటుంబంగా చూడ తగ్గ చిత్రంగా తయారు చేశాడు. కాని అందులో ఒక కాల్ గర్ల్ (జయలలిత) ను చూపి భర్తలు ఆ కాల్ గర్ల్‌తో కులకటం, అలాగే సబ్ ఇనస్పెక్టర్ కాల్‌గర్ల్‌ను లాడ్జిలో అనుభవించటం – ఈ సన్నివేశాలు చిత్రం పవిత్రతను కొంత భంగపరిచాయి. చిత్రం పరుగుకు కూడా అడ్డు తగిలాయి.

తండ్రిగా కృష్ణ, పెద్దమనిషిగా మురళీమోహన్, కొడుకులుగా గిరిబాబు, హరీష్, శ్రీకాంత్ కోడళ్ళుగా, కోవై సరళ, సాగరిక, మీనా, రాజీవి బాగా నటించారు. గిరిబాబు మంచి హాస్యం సరఫరా చేశాడు.

జొన్నవిత్తుల పాటలు, గణేష్ పాత్రో మాటలు సందర్భానుసారంగా అమరాయి. చక్రవర్తి సంగీతం కమ్మగా వుంది. కె.ఎస్.హరి ఫోటోగ్రఫీ ఎప్పుడూ గొప్పగా వుంటుంది.

మురళీమోహన్ తన జయభేరి ఆర్టు ప్రొడక్షన్స్ ద్వారా సమాజానికి పనికొచ్చే చాలా చిత్రాలు నిర్మించాడు. అందులో ఇదీ ఒకటి.

## సినిమా

! పేజీ కొరవ

తెలుగువారికి చేరువైంది. ఇప్పుడు "డాక్టర్ అంబేత్కర్" చిత్రంలో దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌గా నటిస్తోంది. "మీ పారితోషికం ఎంత ?" అని నిర్మాణ పర్యవేక్షకుడైన కె.యస్. రామారావు అడిగితే, కస్తూరిబా తర్వాత నేను చేస్తున్న మరో సజీవపాత్ర ఇది. పైగా, మీది తక్కువ బడ్జెట్ చిత్రం. మీకెంత వీలయితే అంతే ఇవ్వండి" అన్నదామె. నిర్మాతలు సూచించిన పదకొండు వేలకు ఆమె ఇట్టే అంగీకరించేసింది. మరో తార ఎవరైనా అయితే లక్షరూపాయలకు తక్కువ అంగీకరించేది కాదేమో!

## విశ్వామిత్ర

(9 పేజీ కొరవ)

తార పుష్పవల్లి మే11 న మద్రాసు విజయా హాస్పటల్‌లో అసువులు బాసింది. మూత్ర పిండాల వ్యాధికి, హృద్రోగానికి ఆమె నాలుగు మాసాలకు పైగా చికిత్స పొందుతూ వచ్చింది. వయసు 72. ఏకాయకిన బొంబాయి నుంచి వచ్చిన ఆమె కూతురు హిందీ నటి రేఖకు కలిగిన దుఃఖం అంతా ఇంతా కాదు. తల్లిని బ్రతికించుకోడానికి రేఖ కొన్ని లక్షలు వ్యయం చేసింది. తల్లీ కూతుళ్ళు కలసి బి.ఎన్.రెడ్డి గారి "రంగులరాట్నం"లో నటించారు. జెమినీ వారి "బాలనాగమ్మ" చిత్రంలో రాణి

సంగుగా పుష్పవల్లి నటన తమిళ ప్రేక్షకులను సైతం ఉర్రూతలూపింది. పుష్పవల్లికి ఒక కొడుకు, నలుగురు కూతుళ్లు ఉన్నారు.

## కరెంట్

(4 పేజీ కొరవ)

పోతున్నారంటే అతిశయోక్తి కాదు. మరో వైపు విద్యార్థులకు పరీక్షలు. విద్యుత్ సరఫరా లేకుంటే నీటి సరఫరా వుండదు; కొన్ని చోట్ల బావులెండి పొయ్యాయి. కొన్ని చోట్ల నీరు అడుగంటి పోయింది. టవున్‌లో కొత్తగా విస్తరించిన ప్రదేశాలలో కుళాయిలు రాలేదు; బావుల్లో నీరు లేదు. వారి అవస్థ భగవంతుని కెరుక. సరఫరా లేకుంటే ఆఫీసు, పరిశ్రమలు, ఆస్పత్రులు తదితర చోట్ల పనులు స్తంభించి పోతాయి. దీని మూలంగా నష్టం ఎంత వుంటుందో, ప్రజల కష్టాలు ఎంత దుర్భరంగా వుంటాయో అంచనా కట్టలేము.

ముఖ్యంగా ఈ పక్షం రోజుల నుండి వున్నంత దౌర్భాగ్యస్థితిని, దుస్థితిని మున్నెన్నడూ ఎరుగము. వేసవి రోజులలో విద్యుత్ వుత్పత్తి తగ్గిపోవడం, పూర్తిగా లేకుండా పోవడం కొత్త కాదు. థర్మల్ స్టేషన్లలో వివిధ కారణాల వల్ల కొన్ని యూనిట్లలో వుత్పత్తి జరగకపోవడమూ కొత్తగాదు. కొరత సంగతి తెలుసు, అవాంతరాలు తెలుసు, అటువంటప్పుడు ఈ గడ్డు పరిస్థితిని ముందుగా ఎందుకు వూహించ లేకపోయారు? అధిగమిం చడానికి విద్యుచ్ఛక్తి బోర్డుగాని, ప్రభుత్వం గాని ఏమి చర్యలు తీసుకున్నది? ఇతర రాష్ట్రాల నుండి కొనో, అడుక్కతినో, దొంగిలించో కొంతకు కొంతైనా ప్రజలకు వుపశమనం కల్గించవలసిన ధర్మం ప్రభుత్వానిది. ఆధర్మాన్ని నెరవేర్చలేక ప్రజల జీవితాలను నరకప్రాయం గావిస్తున్నారు. ఏమి నేరం చేశారని ప్రజలకు ఈ శిక్ష? ఎంత కాలం ఈ బాధ ? ఎంత కాలం ఈ నరకం? ఎంత కాలం ఈ శాపం ? వరుణదేవుడా ఈ ఆపత్సమయంలో నీవే దిక్కు !

## నెల్లూరు సంగతులు

(4 పేజీ కొరవ)

టిసిసి అధ్యక్షుడు ఆనం సంజీవరెడ్డి, మాజీ మంత్రి ఆనం రామనారాయణ రెడ్డి , కళ్యాణి ఫిలింస్ శ్రీ ప్రసన్నకుమార్ రెడ్డి , మాగుంట సుబ్బరామరెడ్డిగారి అనుచరగణ ప్రథములు శ్రీ మదాసు గంగాధరం, శ్రీ చెన్నారెడ్డి పెంచలు రెడ్డి తదితరులు మాట్లాడారు. ఈ సందర్భంలో వెలువరించిన రాజీవ్ గాంధీ జీవిత చరిత్ర గ్రంథాన్ని శ్రీ సుబ్బరామరెడ్డి ఆవిష్కరించారు.

ముఖ్యమంత్రి శ్రీ జనార్థనరెడ్డి సూచన మేరకే ఈ ఎగ్జిబిషన్ నిర్వహించామని చెప్పారు శ్రీ ఆనం వివేకానంద రెడ్డి. నెల్లూరు సెంట్రల్ స్కూలు కరస్పాండెంట్ శ్రీ కె.ఎస్.రావు వందనాలు చెప్పారు.

ప్రదర్శనలో బహుమతుల వివరాలివి-

సంస్థలలో నెల్లూరు సెంట్రల్ స్కూలు, స్వామిదాస్ ఇంగ్లీష్ మీడియం స్కూలు, ప్రభుత్వ శాఖలలో వ్యవసాయం, హౌసింగ్ కార్పొరేషన్ ప్రథమ ద్వితీయ బహుమతులు పొందాయి. శ్రీ కోటగిరి ఎబ్బజీర్, శ్రీ పె. మదన్ బాబు ఉత్తమ ప్రదర్శనా బహుమతులు పొందారు.

చిత్రలేఖన పోటీలో 15 ఏళ్ళలోపు గ్రూపులో వై. ఎహోవా (ముత్తుకూరు) పి. శ్రీహరి ( నెల్లూరు వి.ఆర్.హైస్కూలు) ; 15 ఏళ్ళ పైబడిన గ్రూపులో కె.రాజా( నెల్లూరు) షేక్ రవీంద్ర సింగ్ ( నెల్లూరు) ప్రథమ ద్వితీయ బహుతులు పొందారు.

## బాలాజీ నగర్

## అన్నదానం

రాజీవ్ వర్థంతి సందర్భంగానే 21 తేది ఉదయం బాలాజి నగర్‌లో పేదలకు అన్నదానం జరిగింది. శ్రీమతి పందిళ్లపల్లి అరుణమ్మ దీనికి సారథ్యం వహించారు. ఎమ్మెల్యే శ్రీ జెకె రెడ్డి అన్నదానం జరిపారు.


జమీన్‌రైతు

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ. 75.00 |
| ఆరు నెలలకు | రూ. 40.00 |
| విడి ప్రతి | రూ. 1.50 |

# RATNAM RESIDENTIAL JUNIOR COLLEGE



Ratnam Nagar, Pidathapolur, Nellore Dt. 524 316 Tel. 53 (Vallur Ex.)

1992 ఇంటర్మీడియట్ పబ్లిక్ పరీక్షలో రాష్ట్ర స్థాయిలో 4 వ ర్యాంకు సాధించి నెం.1 అని మూడవసారి నిరూపించి విజయకేతనం మరోసారి ఎగురవేసిన ఉన్నత విద్యాకేంద్రం.

ఈ విజయం గతంలో మాసంస్థ సాధించిన కీర్తికి కలికితురాయి.

**ఈ ఘనతను మాకు కట్టబెట్టిన మా ప్రియతమ విద్యార్థి**



చిరంజీవి కరిముల్లాఖాన్

హాల్ టిక్కెట్ నెం. 553218.

ఆ చిరంజీవికి మా హార్ధికాభినందనలు-శుభాశీస్సులు.

రాష్ట్ర స్థాయిలో ర్యాంకులు వచ్చిన మా (ఆ) పూర్వ విద్యార్థులు.

1988 చిరంజీవి పి. గురుప్రసాద్ 9 వ ర్యాంకు 1990 చిరంజీవి ఎం. బసవరాజు 3 వ ర్యాంకు

చిరంజీవి వి. సతీష్ చంద్ర 5 వ ర్యాంకు

ఈ శుభ సందర్భంలో ఆ చిరంజీవులను మరొకసారి మనస్ఫూర్తిగా అభినందిస్తూ శుభాశీస్సులందజేస్తున్నాము.

మా ప్రియతమ విద్యార్థినీ విద్యార్థుల బంగారు భవిష్యత్తుకు మా శిక్షణ సోపానమని మా విజయ పరంపర సాక్షిగా మరొకసారి మనవి చేస్తున్నాము.

ఇంటర్మీడియట్ ఎం.పి., బై.పి. గ్రూపులకు తెలుగు/ ఇంగ్లీషు మీడియంలలో ఉత్తమ శిక్షణ యిచ్చు సంస్థ మాదని మరొకసారి సవినయముగా గుర్తు చేస్తున్నాము.







# ABRAR రెసిడెన్షియల్ జూనియర్ కాలేజి

Office: ఆచారివీధి, నెల్లూరు
Campus: పొదలకూరు రోడ్డు, నెల్లూరు
✆: 28892
27893

1992-93 విద్యాసంవత్సరమునకు జూనియర్ ఇంటర్ M.P.C & Bi.P.C గ్రూపులకు ఇంగ్లీషు & తెలుగు మీడియంలలో అడ్మిషన్లు జరుగుచున్నవి.

10-6-92 నుండి క్లాసులు ప్రారంభం.

* అనుభవజ్ఞులైన వి.ఆర్.కళాశాల అధ్యాపక బృందంచే క్రమశిక్షణతో కూడిన బోధన
* పూర్తి వసతులతో కూడిన లేబోరేటరీలు మరియు ప్రింటెడ్ మెటీరియల్
* కంప్యూటర్ శిక్షణ మరియు వ్యక్తిగత పర్యవేక్షణ
* సెమి రెసిడెన్షియల్ సౌకర్యము మరియు డేస్కాలర్స్‌కు ప్రవేశము.
* జూనియర్ ఇంటర్ ఇతర చోట్ల చదివిన వారికి కూడా సీనియర్ లో ప్రవేశము.

డైరెక్టర్

S. అబ్రార్ M.Sc., M.Phil

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET printing at Nayagara Books Pvt. Ltd. Nellore.